శ్రీః

# శృంగార కాళిదాసు

( చిత్రకథలు )

ప్రథమభాగము



శే. కృష్ణస్వామి శర్మగారిచే
సంకలితము.

ప్రకాశకులు.
జి. ఎస్. శాస్త్రి అండుకో
తపాలాపెట్టె నెం 110
మద్రాసు.

# పీఠిక.

---

ఆబాలగోపాలము సరసకథాకుమారి నాహ్వానింతురు. చూచి యానందింతురు. తద్గుణగణమును విని పరవశులగు దురు. రసవత్తరముగను, అతిమనోహరముగను, సరసజన హృదయాహ్లాదకరముగను, అద్భుతమై అసమానమనీసావిశేష భాసురముగనున్న కథాసంవిధానమును చూచి, చదివి యా నందించనివా రుందురా? కథలనిన సర్వసామాన్యముగ నెల్ల రకు సంతోషదాయకములు గదా! అందును, లోకవిఖ్యాతి గాంచిన కవిసార్వభౌముడగు శృంగారకాళిదాసుని శృంగారకథ లెవ్వరికి రుచింపకుండును. శ్రీరామచంద్రుని దివ్యకథా సుధా నిధి నెంతగ్రోలినను తనివితీరకుండునో అటులనే శృంగారకాళి దాసుని చరిత్రాంశములుకూడ పునఃపునః పఠనీయములుగా నుండుననుట సరససుజను లెల్లరకు విదితము. కాళిదాసుని కవి తాశక్తిని బడయుటకై యొకమహానుభావుండు

కాళిదాసకవితా నవం వయః
మాహిషం దధి సశర్కరం పయః
ఏణమాంస మబలా చ కోమలా
సంభవంతు మమ జన్మజన్మని.

అని వరమును కోరుకొనెను. కాళిదాసుని కవితాసామర్థ్యమును, భావప్రభావమును, సరసపదవిస్ఫురణమును, విప్రలంభశృంగార రసప్రసారమును, వర్ణించుటకు, వచించుటకు, సంస్మరించుటకుఁగూడ తక్కుంగల కవులెల్లరు శక్తివిహీనులనియే చెప్పవచ్చును.

## గ్రంథవిషయము.

ఈ గ్రంథకర్త శృంగారకాళిదాసునిచరిత్ర యంతయు సులభశైలిని యిందు పొందుపరచినారు. ఇందు భోజరాజ, కాళిదాస, లీలావతి, శారదల పూర్వజన్మవృత్తాంతము, భోజపుత్రికయగు శారద మహాపండితునియొద్ద విద్యాభ్యాసము చేసి సమస్తశాస్త్రములయందును, చతుష్షష్టికళలయందు అసమాన పాండిత్యమును సంపాదించుట, సత్యవంతునికుమార్తె యగు చంపకకలిక గురుసన్నిధిని యఖిలవిద్యలను భక్తిశ్రద్ధలతో పఠించుటయు, గురువు ఆచంపకకలికను మోహించి, ఆమెచేఁ దిరస్కృతుఁడై సత్యవంతునికడకరిగి యల్లునిఁ దెచ్చు కార్యము తనకు విధింపుఁడని కోరుటయు, నందులకతఁడు సమ్మతింప, బహుగ్రామపట్టణములను వెదకివెదకి కడకు మూర్ఖుఁడగు యెణుకుల బాలుని ఒకని తెచ్చి చంపకకలికకు వివాహము గావించుటయు, ఎణుకుల బాలుని మూర్ఖత్వమును, మౌఢ్యమును తెలిసికొని ఆమె యీబాలుని కాళికాలయమున కంపుటయు, బాలునకు

కాళికావరప్రసాదము, కాళికాదర్శనము, కాళిదాసు అనుబిరుదునుపొంది కాళికాదేవిని దండకరూపమున అనర్గళ మృదుమధురకవితాప్రవాహముచే స్తుతించుటయు, పిమ్మట కాళిదాసు శృంగారపురాధీశ్వరుఁడగు మదనసేన మహీపతి యాస్థాన కవిశిఖామణిగ నుండి శృంగారకవి యనుబిరుదమును పొందుటయు, భోజభూజానిపుత్త్రిక యగుశారద స్వయంవరమునకై మదనసేన మహారాజుకుమారుఁడగు శూరసేనునితో ధారానగరమున కేగుటయు,చతుష్షష్టికళాప్రవీణలగు పండితదాసీలను అరువదినాల్గుద్వారములలో నతఁడు జయించుటయు, సమస్తశాస్త్రవేదినియు, సకలకళాప్రవీణయు, భూలోకశారదయు అగు శ్రీశారదను జయించుట మున్నగునవి ఇందు సరసముగ మిక్కిలి చక్కఁగ నిరూపింపఁబడినవి. సందర్భానుసారముగ సంస్కృతాంధ్ర ప్రబంధగతపద్యరాజము లచ్చటచ్చటఁ బొందుపరుపం బడినవి. ఈ ఆంధ్రపద్యములకంటె సంస్కృతపద్యభూయిష్ఠముగనే గ్రంథమును వ్రాసిన చాల బాగుగానుండునేమో? లోకజ్ఞానము, నీతి, విజ్ఞానము తెలిసికొనుటకు ఈగ్రంథము మిక్కిలియు నుపకరింపఁగలదు.

ఈశృంగారకాళిదాసకథల నెంతో వ్యయప్రయాసముల కోర్చి రసవత్తరముగ కథారూపమునఁగూర్చి, సమస్తాధికారములతోను మాకొసఁగిన బ్రహ్మశ్రీ. శె. కృష్ణస్వామిశర్మగారికి

మాకృతజ్ఞతను తెలుపుచు, శృంగారకాళిదాసుకథలు ద్వితీయభాగమును కూడ త్వరలో ముగించుటకు శ్రీపరాత్పరుఁడు ఆయురారోగ్యవిభవము లిచ్చుగాక యని కోరుచున్నాము.

ఇట్లు,

మద్రాసు.
16-1-28

జి. ఎస్. శాస్త్రి అండు కో.

# శృంగార కాళిదాసు.

## ప్రథమ ప్రకరణము.

### ౧. భోజవృత్తాంతము.

శ్రీమన్మహారాజాధిరాజబిరుదాంకితుఁడగు విక్రమాదిత్యునివంశమున సింధులుఁడను రాజు ధారానగరమును రాజధానిఁగాఁ జేసికొని మాళవదేశమును నేకచ్ఛత్రముగఁ బరిపాలించుచుండెను. రాజ్యాభిషిక్తుఁ డైనదాదిగ, రాజనీతిఁ దప్పక, దేవబ్రాహ్మణభక్తితోడను దీనులయందలి దయతోడను, యాచకులపాలిటికల్పవృక్షముగనునుండి, రెండవ శ్రీరామచక్రవర్తియో యనునటులు వెలయుచుండెను. తన బాహుబలపరాక్రమములచే శత్రురాజులకు సింగమువలెనుండి, సకలరాజులను తనకు సామంతులుఁగాఁజేసికొని ఆతఁడు రాజ్యాధికారమును దీర్ఘకాలము చెల్లించుచుండెను. ఏవిషయమునను కొఱంత యనునది లేక, సకలసంపత్సమృద్ధమై ఆతనిరాజ్యముండెను. ఆమహారాజు తనగృహమువలెనే, పాలితులగు ప్రజలగృహములను సంపత్తులచే నిండించుచుండెను. ఇట్లు పరిపాలించుచున్న నాధర్మరాజునకు సంతానహీనతయే పెద్ద కొఱంతగ నుండెను. వృద్ధత్వము సంభవించినను, సంతానహీనుఁడై

యుండెను. సింధులమహారాజు రాత్రియుఁబవలు సంతానవిహీనతకు పలువిధములఁ జింతించుచుండెను. తనరాజ్యములోని బాలురచేష్టితములఁ గని సంతసించు మాతాపితలఁజూచి సంతసించుచు, వారల భాగ్యమును నుతించుచు, తన కట్టిభాగ్యము కలుగలేదుగదా యని, తన యభాగ్యమును నిందించుకొనుచుండును. అపుడపుడు "అపుత్రస్య గతి ర్నాస్తి" యను నార్యోక్తిని దలఁచికొని కుందుచుండును. తనకు సద్గతి లేకపోయెఁగదా యని పలుమాఱు పలవరించును. అపరిమితమగు రాజభోగములు గలిగియుఁ బరలోకమునఁ దనకు సుఖము లేదు గదా యని చింతించును. సంతానప్రాప్తికై గల సకల వ్రతములను, సకలదానములను చేసెను; కాని యెన్ని చేసినను సంతాన ప్రాప్తి కలుగఁజాల దాయెను. భగవంతుని యనుగ్రహము లేనిదే యెన్నిచేసినను నేమి ప్రయోజనము?

ఇటులఁ గొన్ని వత్సరములు పరితపించి,తుదకు కొందఱు విప్రోత్తముల యుపదేశానుసారము పాపశాంతికొఱకు మహాదానముల సద్బ్రాహ్మణుల కొసంగెను. పెక్కుమహాక్షేత్రములను బుణ్యతీర్థములను సేవించెను. ఇటులు కొన్ని దినములు గడువ, సింధులుని పట్టమహిషి యగు సావిత్రీదేవి గర్భవతి యయ్యెను. ఈశుభవార్తను విని సింధులమహారాజును, అతని సామంతులును, ప్రజలును సంతోషాంతరంగు లైరి. సావిత్రీదేవి గర్భము దినదినప్రవర్ధమాన మై పూర్ణగర్భ మయ్యెను.

## ప్రథమ ప్రకరణము.

ఈరీతిని సావిత్రీదేవి దశమమాసమున సుముహూర్త మునఁ బూర్ణచంద్రునిఁబోలె సకల లక్షణసమన్వితుఁడైన యొక యపూర్వశోభావంతుఁడగు శిశువును గనెను. అట్టి లావణ్యనిధి యగుకుమారుని జననమును విని, సింధులుఁడు పరమానందాబ్ధిలో మునింగెను. అట్టిసమయమున సింధులుని సంతోషమునకు మేర యుండునా? యౌవనమునందె కుమారుల గని సంతసించుటయే లోకాచారమై యుండ, వృద్ధాప్యమున గలిగిన సంతానమునకై మాతాపితలసంతోషమునకు హద్దుండునా? ఆజన్మదినోత్సవమున బ్రాహ్మణోత్తములతోడను అమాత్యవర్గముతోడను బ్రహ్మానందము ననుభవించుచు, జాతకర్మాది క్రియల శాస్త్రోక్తముగ జరిపి, భోజుఁడని అతనికి నామకరణము చేసెను.

ఆశిశువును క్రమక్రమముగ శుక్లపక్షచంద్రునిభాతి దినదినప్రవర్ధమానుఁ డగుచుండెను. సావిత్రీసింధులులు ఎట్టికొఱంతయు లేక, సకలము సమృద్ధమై యుండఁగా, రాజకార్యములను గమనింపక, యెల్లప్పుడును బుత్త్రుని ముద్దాడుటయందే కాలముఁ గడపుచుఁ గృతార్థు లగుచుండిరి. భోజకుమారుని సౌందర్యమును, గాంభీర్యమును, రాజతేజమును భావికాలమున నతఁ డొనరింపంబోవు మహాకార్యముల సూచించుచుండెను. తెలిసియుఁ దెలియని బాలచేష్టలును, వచ్చియు రాని ముద్దుపల్కులును సావిత్రీసింధులులనేకాక, యెల్లరను రంజిం

పఁజేయుచుండెను. క్రమముగ భోజుఁడు అయిదేండ్ల ప్రాయము వాఁడయ్యెను. సింధులమహీపతి వృద్ధుఁడగుటవలనను, భోజుఁ డుచితానుచితములఁ దెలియనిబాలుఁ డగుటచేతను పుత్రుని పురోభివృద్ధిని గుఱించి యెపుడపు డాలోచించుచుండును. పుత్రవాత్సల్య మమోఘముకదా! ప్రతివానికిని నదృష్టము ప్రధానమని యెఱిఁగియు,సింధులుఁ డూరకుండక పుత్రవాత్సల్యముచే జ్యోతిషికు నొకనిఁ బిలిపించి భోజకుమారునిజాతకముఁ జూపించెను. అజ్యోతిష పండితుఁడు భోజునిజాతకమును చక్కఁగఁజూచి, మహీపతితో నిటు లనెను —

"ఓ మహారాజా ! ఈజాతకుఁడు దీర్ఘాయుష్మంతుఁడు. ధైర్యము, శౌర్యము, పాండిత్యము, పరరాజభయంకరత్వము మున్నగు ననేక సుగుణములు కలిగి, యనేక వత్సరములు మహి నేకచ్ఛత్రముగ నేలఁగలఁడు. ఈజాతకుని పాలనకాలమున, దేశములో నొక్కండేనియు, మూర్ఖుఁడుండ నేరఁడు. పాలితప్రజ లందఱు విద్యావంతులుగను,సన్మార్గవర్తనలుగలిగిన యైశ్వర్యవంతులుగను నై మనఁగలరు. కాని బాల్యమున నొక గండము కలదు. అది యొకపుణ్యపురుషునివలనఁ దప్పిపోఁగలదు. సుఖదుఃఖము లొక్కొక్కరికిని గలుగుచుండును. ఆరెంటిని సమదృష్టితోఁ జూచువాఁడే విద్వాంసుఁడనఁదగును. సుఖము కలిగినపు డుప్పొంగుచుఁ గష్టములకుఁ గుందువాఁడు మూర్ఖుఁడగును. కాన నిన్ని సద్గుణములతోఁ

బాటుగ నీమాత్రపుకష్టమును నీజాతకునికిఁగలదు. కాన దాని నిమిత్తమై చింతింపవలదు" అని జ్యోతిషికుఁడు వచింపఁగా విని రాజువాని సత్కరించి పంపివైచెను.

అనంతరము సింధులమహీపతి వృద్ధుఁడగుటవలన రాజ్యభారమును వీడి, వానప్రస్థము స్వీకరింపఁ దలఁచెను, కాని తన స్థానమున నుండి ధర్మముఁ దప్పక రాజ్యము నేలఁగలవాఁ డెవఁడును లేఁడాయెను. భోజుఁడో చిఱుతప్రాయపువాఁడు. వాని కట్టి సామర్థ్యమింకను గలుగలేదు. కాని తన కసమర్థుఁడును, దుర్మార్గనిధియు, నగుముంజుఁడను తమ్ముఁ డొకఁడు గలఁడు. వానికి రాజ్య మిచ్చిన సత్పరిపాలన ప్రజలకు లభింపకుండుటయే కాక, భోజునికిని నేదైననాపద గలుగఁగలదు. కావునఁ దన తమ్మునికి రాజ్యము నీయ సందేహించెను. రాజ్యపాలనము విషయమై సింధులుఁడు పరి పరివిధముల వితర్కించుకొనుచుండెను.

ఇటులఁ గొన్ని దినములు గడవఁగా, నొకనాఁడు తన ముఖ్యామాత్యుఁడును, రాజభక్తిసంపన్నుఁడు నగు బుద్ధిసాగరుని పిలచి యాతనితో నిటు లనెను.- "ఓమంత్రిసత్తమా! మా పూర్వు లందఱు రాజనీతిఁ దప్పక ప్రజలపై దయగలిగి రాజ్యముఁ బాలించి కీర్తికాయులైరి. నీసహాయమున నేనును నింతదనుక నారీతినే పాలించుచుంటిని. మాపూర్వులనుండియు మన రాజ్యమున నధర్మదేవతకు నిలువనీడ లేకయుండెను. నేనో

వృద్ధుఁడనైతిని. రాజ్యభారమును వహింప నసమర్థుఁడనైతిని. భోజుఁడో బాలుఁడు. యుక్తాయుక్తము తెలియఁగనివాఁడు. గురుకులవాసముఁ జేయఁదగినవాఁడు. ఒకరియధీనమున నుండి, వృద్ధికి రావలసినవాఁడు. అట్టివానికిఁ బట్టముఁ గట్టుట వాని శ్రేయమునకుఁదగదు. ఇఁక మిగిలినది ముంజుఁడే. అతఁడన్నో మహాబల సంపన్నుఁడు; కాని దోషనిధి. రాజ్యప్రాప్తికై యహోరాత్రములఁ గుతంత్రములఁబన్నువాఁడు. ఇతనికి రాజ్య మిచ్చినను, భోజుని కుపద్రవముకలుగును. ఈయకున్న నేను బ్రజానిందకుఁ బాత్రుఁడను కావలసియుందును. ఎటులఁ జేయుటకును పాలుపోవ కున్నది. ప్రజానిందను లక్ష్యము సేయక భోజునికే రాజ్యమిచ్చినచో, ముంజుఁడుతప్పక రాజ్యకాంక్షచే భోజుని జంప నుంకించును. అప్పుడు రాజ్యము నొసంగుట వాని క్షేమమునకు గాక, వానిహానికొఱకేయగును. దీనిచే వంశహానియుఁ బుత్రహానియుఁ గలుగును; కాన నివియన్నియుఁ జక్కఁగ నాలోచించి నా కుపాయముఁ దెలుపుము? అనవుఁడు బుద్ధిసాగరుఁ డిట్లనెను.

"ఓమహీపతీ! మీవాక్యము లెంతయు యథార్థము లగును. ముంజునిప్రవర్తనము మిక్కిలి నీచమైనదియే. వానికిఁ గల రాజ్యకాంక్షచే నెంతైనను జేయును. పాపభీతియు దైవభీతియు లేనివాఁడు. మిగుల దుర్మతి, లోభి. కనుక నే.

శ్లో. లోభాత్ క్రోధః ప్రభవతి క్రోధాత్ మోహః ప్రవర్తతే
మోహేన నరకం యాతి శాస్త్రజ్ఞోఽపి విచక్షణః.

అని పెద్దలవాక్యము ప్రకారము లోభమువలనఁ గోప మును, కోపమువలన దుర్బుద్ధియు, దానిచే నరకమును నెట్టి శాస్త్రజ్ఞుఁడును పొందకమానఁడు.

శ్లో. మాతరం పితరం పుత్రం భ్రాతరం వా సుహృత్తమం.
లోభావిష్టో నరో హన్తి స్వామినం వా సహోదరమ్.

అనిన ల్లాశగలవాఁడు తల్లినేనియుఁ, బుత్రునేనియుఁ దం డ్రినేనియుగురుని నేనియుఁ జూడఁడు. వాని కాశయే ప్రధానము. అటునలెనేయివి యన్నియు ముంజుని విషయమున, నాలోచించు టముఖ్యమే యగును. కనుక ప్రస్తుతస్థితి, నాలోచించిన రాజ్య ము ముంజునకిచ్చుటయే మంచి దగును. భోజకుమారుని వాని కప్పగింపుఁడు. ఇదియే మీ రిపుడు చేయఁదగిన కార్య మగును. ఇట్లుచేసినభోజుఁడు ముంజుని యనంతరమేనియు రాజ్యమునకు రాఁగలఁడు. ఇదియ కర్తవ్యము" అనెను.

బుద్ధిసాగరుఁడు బుద్ధిసాగరుఁడే యగును. ఇట్టివాఁడే యమాత్యశేఖరుఁ డనఁదగు. ఇటులు మంత్రి వచించిన మాటల విని, సింధులుఁడు ముదమంది, ముంజునకే రాజ్యమీయ నిశ్చ యించి, ముంజునిఁబిలువనంపి "తమ్ముఁడా! నేను వృద్ధుఁడ నైతిని. రాజ్యపరిపాలనము నాకు దుస్సాధ్యముగ నున్నది. కావున దీని ని వహింపసమర్థుఁడవు నీవే యగుదువు. భోజుఁడు బాల్యమున నుంటచేనీరక్షణక్రింద నుండవలసి యున్నాఁడు. నీకు రాజ్యమును, భోజుని, నొప్పగింప నిశ్చయించితిని. వానికి విద్యగఱపి, రాజ్య

పాలనసామర్థ్యమును గల్గించుట నీభారమగును. వాని నీపుత్రుని౯ గట్రేమించి కాపాడుట నీకుధర్మమగును" అని హితము బోధించి తమ్ముని౯ బట్టాభిషిక్తు౯ జేసి ఆత్మజ్ఞానాభిలాషియై యేకాంతమున నుండి, భగవానుని ధ్యానించుచు౯ గాలము౯ గడపుచుండెను. ముంజుఁడును రాజ్యాభిషిక్తుఁడై రాజ్యమును పాలించుచుండెను.

పిదప౯ గొన్ని దినములకు సింధులమహారాజు స్వర్గస్థుఁడయ్యెను. రాజాంతఃపుర మంతయు రోదనధ్వనులతో నిండిపోయెను. ముంజుఁడు భ్రాతృవియోగమునకు౯ గుందుచు, భోజునిచే సకలపైతృకకర్మల సక్రమముగ నాచరింప౯ జేసెను. పిదప భోజునికి సకలవిద్యలును సద్బుద్ధిని కలుపఁగల యొక శాస్త్రజ్ఞుని నుపాధ్యాయునిగ నియమించెను. భోజుఁడును మిక్కిలిగురుభక్తితో శుశ్రూషలు సలిపి, విద్యాభ్యాసము౯ జేయ మొదలిడెను. ముంజుఁడు సింహాసనాసీనుఁడై ముద్రాధికారమును స్వీకరించి, మదోన్మత్తుఁడై, చిరకాలమునుండి మంత్రియై రాజవంశశ్రేయోభిలాషియై ప్రజాభిలాషియై యున్న బుద్ధిసాగరుని మంత్రివర్గమునుండి తొలఁగించెను. వానిస్థానమున అధికారగర్వితుఁడును, ప్రజావిరక్తుఁడును లోకానుభవశూన్యుఁడును నైనయొకని నియమించెను. రాజసూనుఁడగు భోజుఁడు గురువులయొద్దవిద్యాభ్యాసము సేయుచు, బహుశాస్త్రములఁ బఠించుచు విద్యార్థిదశ౯ గడపుచుండెను. ముంజుఁడు బాల్యమునుండియు, లోభియు

గ్రూరుఁడు నగుటచేతఁ దన యిష్టము వచ్చినరీతిని రాజ్యము నేల మొదలిడెను. ప్రజలక్షేమమున కితఁడు దూరుఁ డయ్యెను. ఈవిధమున దినములు గడవఁగా, భోజునకుఁ బదునాల్గేడులు నిండెను. సకల శాస్త్రముల యందును ప్రతిభాశాలియై పురుషరూపముఁదాల్చిన భూలోకభారతియో యన నతఁడొప్పెను.

ఒకనాఁడు ముంజమహారాజు పండితసభలోఁ గూరుచుండి శాస్త్రవాదముల వినుచుండఁగా సభామండపమున కొక జ్యోతిశ్శాస్త్రపండితుఁ డరుదెంచెను. అతఁడా మహారాజును చూచి స్వస్తివాక్యములఁ బలికి, రాజాజ్ఞచే నొక యాసన మలంకరించి రాజునుద్దేశించి యిటు లనెను. "ఓమహారాజా! నేను బహుశాస్త్రవేత్తను. లోకులునన్ను సర్వజ్ఞశిఖామణి యందురు. మఱియు జ్యోతిశ్శాస్త్రమునఁ బ్రత్యేకప్రతిభ నాకుఁ గలదు. కాఁబట్టి తమయిచ్చవచ్చిన ప్రశ్నము నన్నడుగుఁడు" అన విని మహారాజా బ్రాహ్మణుని ప్రజ్ఞ యెట్టిదో తెలిసికొనఁగోరి "విప్రోత్తమా! నేను జన్మించిన దాది నేటిదనుక నేమేమి చేసితినో, యది యెల్ల సరిగఁ జెప్పితి రేని, తమసర్వజ్ఞశిఖామణిబిరుదము సార్థకము కాఁగలదు లేనిచో నే నొప్పికొనఁజాలను" అనెను. ఆ జ్యోతిషికుఁడు మహారాజునకు దనపాండిత్యముఁజూపందలచి పూసఁగ్రుచ్చినట్లు ముంజుని పుట్టుకనుండిఆక్షణముదనుక జరిగినవిషయముల నెల్లను జక్కఁగ జెప్పిముగించెను. ముంజుఁడు నవి యెల్ల నొప్పికొని యాపండితుని స్తుతించి, యతనిపాదముల

పై బడి భక్తితత్పరుఁడై ఇంద్రనీలపుష్యరాగాదిమణి మయాభరణముల బహుమానమిచ్చి సత్కరించెను. ఆపం డితుఁడును బహుమానముల నంది సంతోషభరితుఁడై యుండ సభలోనున్న బుద్ధిసాగరుఁడు మహారాజు నుద్దేశించి, "ప్రభూ! రాజకుమారుని జన్మపత్రికను గూడ, నీపండితోత్తమునకుఁ జూపుఁడు" అన, రాజును దానికి సమ్మతించి, అతని జన్మపత్ర ము నాయన కిచ్చెను. పండితుఁడు సమక్షమున భోజునిఁ జూడఁ గోరెను. ముంజుఁడు సేవకుని బంపి, పాఠశాలనుండి భోజకు మారు నచటకు రప్పించెను. అట్లు సేవకునితో నేతెంచిన రాజ కుమారుఁడును వినయవిధేయతలతోఁ బినతండ్రికి నమస్క రించి, యొక యాసనమునఁ గూరుచుండెను. ఆసభామండ పములో నాసీనులై యున్న రాజకుమారు లందఱును, భోజుని నిరుపమాన తేజో లావణ్యముల కచ్చెరువందుచు, జూచుచుం డిరి. భూలోకసందర్శనార్థ మరుదెంచినమహేంద్రుఁడో యన నొప్పె నారాజకుమారుఁడు. పండితుఁడట్టి మన్మథాకారు నొక్క మాఱు తేఱి పాఱఁజూచి, మహారాజుతో నిట్లనియె.

"మహారాజా! భోజుని నిఁకఁ బంపివేయుఁ" డనఁగా మహారాజు నటులే చేసెను. పిదప నాపండితుఁ డిటులు భోజుని భవిష్యత్ప్రతిభనుగూర్చి నుడివెను. "ఓముంజప్రభూ! భోజుని భాగ్యోదయమును వర్ణింప నాస్పష్టికర్తకును నలవికాదు.

అట్టిచో నాబోంటి యల్పునకు సాధ్యమా? తమయాజ్ఞ నుల్లంఘింపనేరక నా తెలిసినొలఁదిని చెప్పెదను.

"శ్లో. పంచాశత్పంచవర్షాణి సప్తమాసా దినత్రయం
భోజరాజేన భోక్తవ్య స్సగౌడో దక్షిణాపథః"

గౌడ దేశముతోఁగూడిన దక్షిణాపథమంతయుభోజుఁడు నిరాటంకముగా నేబఁదియైదువత్సరముల నేడుమాసముల మూఁడుదివసములు నేకచ్ఛత్రముగఁ బరిపాలించును. ఇదియే నేఁజెప్పగలిగినఫలము" అనఁగా విని, ముంజుఁడు సభను ముగించి లేచి వెడలిపోయెను. అంత నందఱును దమతమస్థానములకుఁ బోయిరి.

ఆదినము ముంజుఁడు రాజసభనుండి లేచి వచ్చినప్పటి నుండియు, నతనికి మనః స్తిమితము దప్పెను. రాజ్యలోభము తల కెక్కెను. జ్యోతిషికుని వాక్యముల వినినప్పటినుండియు, భోజుని రాజ్యాధికారవిచారమే యెక్కువ యయ్యెను. భోజుఁ డింత బాల్యముననే సకలశాస్త్రములఁ జదివి, పండితుఁ డాయెను. జాతకఫలమును అత్యుత్కృష్టముగ నున్నది. నీఁడిఁకను కొన్ని సంవత్సరము లుండిన రాజ్యాధికారమును వీని కప్పగింపక తప్పదు. నేనొసఁగకున్నను, నెన్నియేని యుక్తులఁ బన్ని రాజ్యాధికారమును వశముఁ జేసి కొనక మానఁడు. మనము రాజ్యాధికారము నేకచ్ఛత్రముగ వహించియుండి, పిదప రాజ్యాధికారవిహీనులమైనచో మమ్మాదరించువా రుందురా? ధనము

న్నంతవఱకును, అధికారము గలిగి యున్నంతవఱకు, నెట్టి మనుజునికిని లోకమునందు గౌరవ ముండును. ఈ రెండును లేని యెడల వాని నాదరించువా రుండరు. ఎంతటిబలవంతుఁడైనను, ఎంతటిపండితుఁడైనను ధనముండిననేగాని శోభింపఁజాలఁడు? భోజుఁడున్న పక్షమున ధనసంచయము నా కెటులు కలుగును.

స్వేచ్ఛగ ననుభవించుచున్న రాజ్యాధికారమును సామాన్యమగును. ధనమును దూర మగును. "నిర్ధనపురుషః ...సమానః" అని కదా పెద్దలు చెప్పుదురు. రాజ్యాధికారము పోయినచో, ధనమును పోవును. కావున రాజ్యము నెల్లప్పుడును మనకే యుండునటులఁ బ్రయత్నింపవలయును. "యత్నీ ఫలీ" యన్నటులు విడువక ప్రయత్నించిన నేదియు నసాధ్యము కాదుగదా! మనమీాసమయమున నిర్లక్ష్యముఁజేసిన, మనకే ముప్పుసంభవింపఁగలదు; కాన జాగరూకతతోఁ బ్రయత్నింపవలయును. ఇంతయేల? నేనైనను రాజ్యము నేలవలయును. లేకున్న భోజుఁడైన రాజ్యము నేలవలయును. ఇద్దఱము బ్రతికియుండిన నిది యెట్లు సాధ్య మగును? ఉన్నచో, నే నుండవలయును. లేకున్న, భోజుఁడుండవలయును. కాని నే నుండుట కుపాయము భోజునిఁ గడఁదేర్చుటయే యగును. సింధులునియందు ప్రజలకు మిక్కిలి విశ్వాసము కలదు. దానిచే వానికుమారుఁడగు భోజునియందును వారనురక్తులే యగుదురు. బుద్ధి సాగరుఁడు భోజశ్రేయోభిలాషి. వానికిని నెక్కువ పలుకుబడి యుండి యున్నది. ఇన్ని యుఁజూచిన

భోజునిఁ కడతేర్చుట కష్టమేయగును, కాని గట్టిప్రయత్నము జేయవలయును. అప్పటికిగాని కార్యము అనుకూలత నందదు. ఈవిషయమున మనకు సహాయముఁజేయువా రెవరున్నారు? మంచిసాహాయ్యకరు లుండవలయును. దీనికి మదీయ హితాభిలాషి యగు వత్సరాజే సహాయముఁ జేయగలవాఁడు నేను రాజ్యాధికారమునకు వచ్చినప్పటినుండియుఁ వాఁడెంతయో సాయముఁ బొందియున్నాఁడు. మఱి గౌరవార్హమును అధికారయుతము నగు అమాత్యపదవిని వహించియున్నాఁడు. వీనినే పిలువనంపవలయు నని పరిపరివిధముల నేకాంతముగ మధ్యాహ్నభోజనము సైతము మాని చింతించి, యచ్చటఁ గల యొకసేవకుని ద్వారమున, వత్సరాజునకు వార్తఁ బంపి, యచ్చోటనే యుండెను.

ఇంతలో సంధ్యాకాలము సమీపించెను. రాత్రి ప్రథమయామమున వత్సరాజు ముంజు నాజ్ఞప్రకారము ముంజభవనమును జేరెను. వత్సరాజు రాక నెదురుజూచుచున్నముంజుఁడు వత్సరాజును గనుటతో నత్యానందభరితుఁడై తనచు ప్రక్కనే యాసన మిచ్చి, కూర్చుండఁజేసి, వత్సరాజుతో నిటు లనియె. "ఓయీ! యమాత్యశేఖరా! నేనిపు డొక ముఖ్యకార్యార్థమై నిన్నుబిలువఁబంపితిని. నీవు తక్క నా కెవరు ననురక్తులు లేరు. నాసుఖదుఃఖములలో నీకును పాలు కలదు. మఱియు నాకుఁ బరమమిత్రుఁడవును అమాత్యుఁడవు నై యున్నావు. మిత్రకార్య

మెట్టిదైనను అవశ్యాచరణీయమేగదా! నాకు రాఁబోవు మహా విపత్తునుండి నన్ను రక్షించుటకు నీకన్న సమర్థులు మఱెవ్వరును లేరు. నేఁజెప్పఁబోవు కార్యమునందే నాభావిసుఖసంపద యాధారపడి యున్నది. దీనినిఁ దప్పక నెఱవేర్చి నన్నుఁ గృతార్థుఁ జేయుము. నాహితముఁ గోరుదువేని సఫలముజేయుము" అని యిటులు పలువిధములఁ జెప్ప, వత్సరాజు "ఓమహారాజా! తమ హితముఁగోరియే నే నున్నవాఁడను. ఆకార్య మెట్టిదైనను తప్పక యాచరింతును. నాప్రాణములసయితము అర్పణచేయఁ గలను. మీ రింతగ జెప్పనేల? ఆకార్య మేదియో సెలవిం" డనఁగా—ముంజుఁడు "ఓవత్సరాజా! నేను ధారానగరరాజ్యలక్ష్మి నెల్లపుడును నావశమందే యుంచుకొన సంకల్పించినాఁడను. దానికి భోజుఁ డడ్డముగ నున్నాఁడు. ఈదిన మర్ధరాత్రమున భోజుని రథమున నెక్కించుకొని, భువనేశ్వరియాలయమునకు తీసికొని పోయి, యాదేవికి నతని బలినీయవలయును. పిదప వానిశిరమును నాకడకుఁ దీసికొని రావలయును. ఈకార్యమును నిర్వర్తించి నాయభీష్టముఁ దీర్పుము. అటుల జేయవైతి వేని నాప్రాణములు నిలువవు. మాఱు వలుకక దీనిం జేయవలయుసుమా!" అనెను.

అతిదారుణములైన యావాక్యముల విని వత్సరాజు చిత్రప్రతిమవోలె నిశ్చలుఁడై నిలువఁబడెను. నోట మాటరాలేదు. ఒకేదృష్టితో ముంజునిఁ జూచుచు నట్లె యాతఁడు నిలువఁ

బడెను. తుదకు తెలివొంది "రాజా! మీయాజ్ఞను జవదాటుట నాతరముకాదు; కాని మీయొద్దను మిక్కిలి చనవు గలవాఁడ నగుటచే నొకమాటఁజెప్పఁ దలఁచితిని. ఆగ్రహింపకుఁడు. మహా ప్రభూ! భోజుఁ డేపాపమునెఱుఁగని బాలకుఁడు గదా! భోజుని యొద్దధనముగాని, సైన్యముగాని, పరివారముగాని లేదు. అతఁడు జీవించియుండినను, మీకపకార మేమి చేయఁగలఁడు? మీరు మిక్కిలి, అతఁడు పసిబాలుఁడు. ఇట్టి నిస్సహాయుఁడగు భోజు నేల చంపవలయును? ముంజుని ప్రాణావసానసమయమున రాజ్యమును భోజుని నీకప్పగించెను. తదాదిగా, భోజుఁడు నిన్నే తండ్రి యనియు, గురువనియు, తనసర్వస్వమనియు భావించి, యున్నాఁడు. నీయాజ్ఞ నెప్పుడేనియు జవదాఁటి యెఱుఁగఁడు. ఇట్టి గుణవంతుఁడును వినయవిధేయ సంపన్నుఁడునగు పుత్రరత్నము నుజంపి మూటఁగట్టికొనున దేమున్నది? ప్రథమము న నాలో చితముగఁ గార్యముఁ జేసి, పిదపఁ బశ్చాత్తాపపడుట నిరర్థకము. ఏకార్యమైనను జక్కగ యోచించి దూరదృష్టితోఁ జేయవల యును. అనాలోచితముగఁ గార్యముఁ జేసిన, నది యాజన్మము హృదయశల్యమై బాధించుచుండును. ఓముంజప్రభూ! సావ ధానచిత్తుఁడవై మఱియు నాలోచింపుము."

"ఇంతియకాదు. భోజుని జంపినచో నా రహస్యము దాఁగదు. ఎటులైనను ప్రజలకుఁ దెలియక మానదు. తెలిసినచో నిన్నును నన్నును మన కుటుంబములను మన నివాసభవనము

లతోడ సమూలముగ ధ్వంసముఁ జేయక మానరు. ఇవియన్ని యు రాజనీతికోవిదుఁడవగు నీకు తెలియనివి గావు. మఱియు పుత్రవధ మహాపాతక మగును. ఇట్టిపని కొడిగట్టకుము. ఇది నీ బోఁటి కీర్తికాలములకుఁ దగదు."

అని యనేక నీతుల వత్సరాజు ముంజునకు బోధించెను, కాని నవియన్నియు వానియెదుట నడవిఁగాచిన వెన్నెల య య్యెను. జ్యోతిషికుని వచనములే ముంజునికి చెవిఁ బడుచుండె ను గాని వత్సరాజుమాటలు వాని చెవి కెక్కలేదు. ముంజుఁడు వత్సరాజు వాక్యములకు కుపితుఁ డయ్యెను. ఆతనికను లెఱ్ఱవాఱె ను. క్రోకఁదొక్కిన త్రాఁచువలె, బుస్సుమనుచు "ఓవత్సరా జా! చాలుఁజాలు నీహితవాక్యములు. నీవు నాకు సేవకుఁడవే కాని గురుఁడవు కావు. ఈవుక్కిటిపురాణముల నేను నెఱుఁగుదు ను. ఇన్ని దినములనుండియు నీవు సేవకుఁడ వనియు, నేను ప్రభు వు ననియు, భావించినందుల కిపు డది విపరీత మయ్యెను. పామునకుం బాలుపోసినను విషము విడువనుకదా! నీవిషయము నటులే యయ్యెను. స్వామికార్యమునందలి యుక్తాయుక్తవిచక్ష ణము సేవకునకు సేయందగినది కాదు. స్వామికార్యముఁ దీర్పని భృత్యుఁడు జీవచ్ఛవమే యగును" అని గద్దించుచుఁ జలికెను. అంత వత్సరాజు తనయైశ్వర్యము, తనప్రాణములునుగూడ ముం జునియధీనమునం దుండుటచే, నెట్టకేల కాకార్యమున కొప్పుకొని యెను. ధనాశ యెట్టిపాపకార్యమునైనను జేయించునుగదా!

చూచితిరా! ముంజుని ఘాతుకచర్య! సింధులుఁడు భోజునిరాజ్యము ముంజుని చేతికొసఁగెను. జ్యేష్ఠునియెడలను భోజకుమారుని యెడలను నెంతటి కృతఘ్నుఁడయ్యెనో చూచితిరా! ఇదియంతయు ముంజునికార్యము కాదు. ధనముచేయుకృత్యము. ధనమెంతటి క్రౌర్యమునైనను చేయించును. దానికిఁ దల్లియనియు, దండ్రియనియు, పుత్రుఁడనియు, సోదరసోదరీమణులనియు, భార్యాభర్తలనియు వ్యత్యాసము లేదు. అందఱును సమానులే. "వినాశకాలే విపరీతబుద్ధిః" అనునట్లు ముంజుని కాపత్కాలము సమీపించినది. వినాశకాలము సంప్రాప్తమైనప్పుడు హితము విషముగనే యుండును. చెప్పిన వినఁడు. తనకునుఁదెలియదు. ఇదియే వినాశకాలమాహాత్మ్యము. ఇట్టివారలకు నీతిగఱపుట కంటెను, మౌనము వహించుటయు మేలు కదా!

"గీ. వేము పాలువోసి ప్రేమతోఁ బెంచిన
చేఁదువిఱిగి తీపిఁ జెందఁబోదు"

అన్నటు లితనిగతి యింతియే! వత్సరాజు వచనములకు ముంజుఁడు సంతసించి కంఠహారమును ఆతనికి బహుమతిఁ జేసెను. వత్సరాజునకు చేయవలసినకార్యమును జెప్పి యతనిని వీడ్కొలిపెను.

అంత వత్సరాజు దుష్కార్యాచరణమనస్కుఁడై రథమును సిద్ధపఱచి, భోజకుమారుని మాయోపాయముచే

రథము నెక్కించి, భువనేశ్వరియాలయమునకు నడపించెను. భోజుఁడును మాఱుమాటాడక వత్సరాజుతోఁ జనెను. రథము భువనేశ్వరియాలయమును జేరెను. సారథి యగు వత్సరాజుతమ్ముఁడును, వత్సరాజును, భోజుఁడును రథమునుండి డిగిరి. భువనేశ్వరియాలయమునఁ బ్రవేశించిరి. నిబిడాంధకార మావరించియుండఁగా, నచ్చోటు జనసంచార రహితమై భయంకరముగ నుండెను. భోజున కేదియుఁ దోఁపలేదు. అట్టి సమయమున వత్సరాజు తనకటిభాగమున వ్రేలాడుచుండిన యొఱనుండి వాఁడిగల ఖడ్గమును బైలకుతీసి నిర్దయుడై జళిపించుచు, "ఓభోజకుమారా! నాయంతటినిర్భాగ్యుఁడును, పాపియుఁ గ్రూరాత్ముఁడును, మఱి ప్రపంచమున నుండఁడు. నీపినతండ్రి యగుముంజునాజ్ఞ చేనతిదారుణకార్యమునఁ గొడిగట్టితిని. ముంజుఁడు నీకుఁ బినతండ్రి కాఁడు. లోభియుఁ బాపియు, భ్రాతృద్రోహియుఁ బుత్రఘాతుకుఁడు నగుచున్నాఁడు. జ్యోతిష్కుని మాటల విన్నప్పటి నుండియు నిన్నుఁజంపించి రాజ్యము నాక్రమింప నిశ్చయించి, యాక్రూరకార్యమును జేయ నన్ను నియోగించినాఁడు. ఎంతటి నీతులనుబోధించినను, చెవిటివాని ముందఱ శంఖ మూదిన ట్లయ్యెను. నేనటు లొనర్పనైతినా, దారపుత్రాదులతో నేమడియవలసియుండును. రాజాజ్ఞ మహాకఠినమైనది. స్వరక్షణార్థ మీకార్యమునఁ గొడఁబడితిని. నేను చండాలుఁడను. రాజద్రోహిని. దేశద్రోహిని, స్వలాభప్రేరితుఁడనై పాపమునఁ గొడిఁగట్టితిని.

ఎట్టిదైనను చేసియే తీఱవలయును. ఏమైనఁ జెప్పదలంతువేని శీఘ్రముగ జెప్పుము" అని కంటనీరు పెట్టుచుఁబలికెను.

భోజకుమారుఁడు వత్సరాజు మాటలవిని చిఱునవ్వుతో దలనూఁచుచు, రాజగంభీరవచనములతో నిటులనెను. "ఓయీ!

శ్లో. రామే ప్రవ్రజనం బలే ర్నియమనం పాండో స్సుతానాం వనం
వృష్ణీనాం నిధనం నలస్య నృపతే రాజ్యాత్పరిభ్రంశనం
కారాగారనిషేవణం చ మరణం సంచిత్య లంకేశ్వరే
సర్వం కాలవశేన నశ్యతి నరః కో వా పరిత్రాయతే?

శ్రీరామచంద్రుఁ డవతారపురుషుఁడయ్యు సకలరాజ్య భోగములకు దూరుఁడై వనమున వసించెను. సకలలోకముల జయించిన బలిచక్రవర్తి బంధింపఁబడెను. పాండవులు వనములఁ బడి పలుకష్టములకు లోనైరి. యాదవులు కృష్ణబంధువులయ్యు ఒకరినొకరు కొట్టుకొని చచ్చిరి. నలుఁడు జూదమాడి రాజ్య హీనుడై ఋతుపర్ణునికి సారథి యయ్యెను. లంకేశ్వరుఁ డగు రావణుఁడు కారాగారమున బంధింపఁబడి మరణమునకు గుఱి యయ్యెను. కాలము సమీపించినప్పుడు, ప్రతివాఁడును, నశింపవలసినదే! దాని నెవఁడును నడ్డగింపఁజాలఁడు. ఈచిఱుతప్రాయముననే నాకు మృత్యువు సంప్రాప్తమైనది. నేఁ జెప్పవలసిన దే మున్నది? భగవంతునిఁ బ్రార్థింపవలసినదే కాని, మఱేమియుఁ జెప్పకొనవలసినది లేదు. కనుకఁ గడసారి భగవంతుని ధ్యానించుకొందును

శ్లో. అంభోధి స్థ్సలతాం స్థలం జలధితాం ధూళీలవ శ్శైలతాం
మేరు ర్మృత్కణతాం తృణం కులిశతాం వజ్రం తృణప్రాయతాం
వహ్నిః శీతలతాం హిమం దహనతా మాయాంతి య స్యేచ్ఛయా
లీలాదుర్లలితాఽద్భుతవ్యసనినే దేవాయ తస్మై నమః.

అని ప్రార్థించి, నేల రాలియున్న మఱ్ఱియాకుల రెంటినిఁ దీసి, దొప్పలుగఁ గుట్టి, వత్సరాజుచేత నున్నఖడ్గముతో తనవ్రేలినిఁ గోసి, ప్రియం దుంశిస్రవించెడి రక్తమును దొప్పలోఁ బట్టి, మఱియొకయాకుపై నొకశ్లోకము నానెత్తుటితో గడ్డిపోచ కలముతో వ్రాసి తనపినతండ్రికి మ్మని యిచ్చి, "ఓవత్స రాజా! ఇదిగో! నీకరవాలమునకు నాకంఠ మీయ సంసిద్ధుఁడ నైతిని. జాగుసేయకుము. రాజాజ్ఞను పాలింపుము. నీవు విచార పడుట తగదు. నీవు భృత్యుఁడవు. ముంజుఁడు ప్రభువు. ప్రభువు వునానతిచొప్పున నడచుకొనుట భృత్యధర్మము. ప్రభుచిత్తము ననుసరించుట భృత్యధర్మను. నాకు మృత్యు వాసన్న మయ్యె ను. దానిబాఱినుండి రక్షింప నీవు సమర్థుఁడవు కానేరవు. మృత్యు వాసన్నము కానపుడు, చంపను సమర్థుఁడవును కానే రవు. లంకాధీశ్వరుఁడగు రావణుఁడును తుదకు మనుష్యమా త్రుఁ డగుశ్రీరామునిచేఁ జంపఁబడెను. ఇ వన్నియుఁ గర్మాధీన ములు. కావున యోచింపకుము. తామసించెద వేని నన్ను భీతి కి లోను జేసినవాఁడ వగుదువు. ఎట్టివానికిని నెంతటిధీరునకును మృత్యువుభయమునే కల్గించును. ముంజమహారాజునకు నాశిర మునుఖండించి, రక్తసిక్తమైన దీనిని జూపుము. నానమస్కార

ముసుముంజునికిని, నాజగదంబ యగుసావిత్రీదేవికినిఁ జెప్పుము.
ఇప్పుడే నాతల్లి జ్ఞాపకమునకువచ్చుచున్నది. ఇఁక నదిపెఱుగును.
అట్లైనచో విచారమున మునుఁగుదును. కనుక నీపనిని కొన
సాగింపుము." అని నిర్భీతుఁడై చెప్పెను.

భోజునిమాటల విన్నయామంత్రి తనదేహమునే మఱ
చెను. కరమున నున్నకరవాలము జాఱెను. తనచేతినున్న మఱ్ఱి
యాకులోని శ్లోకము నొకమాఱు చదివెను. కంటినుండి వేడి
యశ్రువులు ప్రవహింపమొదలిడెను. భోజునిధైర్యమునకును,
వినయసంపదకును, మనసున మెచ్చి, తనప్రాణమును సయి
తము లక్ష్యముసేయక ముంజునాజ్ఞను ధిక్కరించినవాఁడై భో
జుని కెదురై "ఓరాజకుమారా! నీవిజ్ఞానశీలములను, ధైర్యము
ను,వినయమును గనుగొనిననే నిఁక నిన్నుం జంపనొల్లను ఒల్ల
ను. రాజాజ్ఞయెట్టిదైనను, నాకిఁక లక్ష్యము లేదు. ముంజుని
యన్నమును దినుచున్నందుచే, నిట్టికార్యమునకుఁ బూనితిని;
కాని నాయది నరజన్మము కాదు. ఒకనియన్నముఁ దిన్నను
హితాహితములును పరలోకము నున్నవి కదా! వానిని
మఱచి స్వలాభప్రేరితుఁడనైనందులకు నన్ను క్షమింపుము.
నిన్నిఁకఁ జంపనొల్లను. నామనవి విని, మాయింటికి రమ్ము.
ఇది రాత్రికాలముగాన నిన్నెవరును గుర్తింపలేరు. నిన్నొక
యేకాంతస్థలమున నునిచెదను. అనంతరకర్తవ్య మూహింతము.
ఈదీనునియెడ దయఁదలచి, దీని నాలింపవలయును" అని చాల

దీనతతోడను, పశ్చాత్తప్తహృదయముతోడను ప్రార్థింప, భోజుఁడు, ప్రథమమున నంగీకరింపకయ పోయినను, పిదప నంగీకరించి, వత్సరాజుతోను, నతనితమ్మునితోను రథము నెక్కి యాగాఢాంధకారమున ధారానగరమును జేరికొనియెను.

తరువాత వత్సరాజు నిజమందిరములోని యొకయేకాంతస్థలమున భోజు నుండఁగాఁ జేసి, యతని కేకొఱంతయు లేకుండునట్లు, తానె స్వయముగ విచారణసేయుచుండెను. పిదప వత్సరాజు ధారానగరములోని శిల్పచాతురీధురీణుఁడగు నొకనిఁ బిలిపించి, భోజకుమారుని శిరసును బోలినశిరము నొకదానిని లక్కతోఁ జేయించి, మఱునాటిరాత్రి ముంజుని యంతఃపురమునకు గొనిపోయి, యతనికిదానినిచూపించెను. ఎంతటి కఠినుఁడైనను, ఆశిరస్సును జూచినపుడు పరితపింపకుండ నేరఁడు కదా! ముంజుఁడునద్దానినిఁ జూచినతోడనే, మైమఱచి, 'భోజా!' యని భోరుననేడ్వ మొదలిడెను. అది విని యంతఃపుర స్త్రీలును భోజుఁడే మయ్యెనో యని విలపించిరి. భోజునింగానమికి విలపించుచున్న భోజమాతయుఁ బెద్దపెట్టున నేడ్వఁ దొడగెను. ఇది ధారానగరమంతయుఁ దవాగ్నివోలె నిముసమునఁ బ్రాఁకెను. ఆధారానగరమే పాడువాటి, రామునివదలిన యయోధ్యవలె నయ్యెను.

ఇది యిటులుండఁగా వత్సరాజు తెచ్చిన శిరమును జూచి, యేడ్చియేడ్చి, తుదకెట్టులనో, దుఃఖము నాఁపికొని, ,భోజుఁడు ఏమైన నాతోఁ జెప్పమనెనా' యని యడిగెను. నమ

స్కారపూర్వకముగ నీయుత్తరమును తమ కంపెను' అని తన చేత నున్నమఱ్ఱియాకును వత్సరాజాతని చేతికి నిచ్చెను. దానిని గైకొని ముంజుఁ డిట్లు చదువసాగెను.

"మాంధాతా చ మహీపతిః కృతయుగాలంకారభూతో గతః
సేతు ర్యేన మహోదధౌ విరచితః క్వాఽసౌ దశాస్యాంతకః?
అన్యే చాఽపి యుధిష్ఠిరప్రభృతయో యాతా దివం భూపతే!
నైకేనాఽపి సమం గతా వసుమతీ నూనం త్వయా యాస్యతి.

"కృతయుగమునకు భూషణ మై భూమి నంతయు నేలిన మాంధాత మృతిఁ జెందెను. సముద్రముపైని సేతువుఁగట్టి, రావణుని వధించినయా శ్రీరామచంద్రుఁ డిపు డెచ్చట నున్నాడు? ధర్మరాజు అని ప్రఖ్యాతిఁ గాంచినయాయుధిష్ఠిరుఁడు మున్నగు తక్కుంగల రాజులు సైతము చివఱకు స్వర్గతు లైరి గదా! వా రెవరును దమతో నీభూమిని దీసికొని పోవ సమర్థులు కాఁజాలక పోయిరి; కాని అట్టియీభూమి నీయొక్కనితో మాత్రము వెంటనంటి రాఁగలదు అని తోఁచుచున్నది."

ఇటులు చదివికొని వెంటనే యారాజు మూర్ఛితుఁ డయ్యెను. "హా భోజా" యని నెత్తిమఱియు బాదుకొని ఆతఁడు పెద్ద పెట్టున నేడ్వసాగెను. మఱియు భోజకుమారుని గుణగణములఁ బొగడుచుఁ పరిపరివిధముల నాక్రందన మొనరింప సాగెను. తనయకృత్యమునకు తన్నుఁ దాను నిందించికొనెను. వత్సరా జెన్నివిధముల నూఱడించినను, నూతనప్రవాహమువోలె

పొంగిపొరలుచున్న దుఃఖవాహిని నాఁపఁజాలఁడయ్యెను. ఈ దుఃఖసముద్రమున నీలాడుడుచు నన్నపానాదులనైతమునాతఁడు విసర్జించియున్మత్తునిభంగి నిలిచినచోట నిలువకయుఁ గూర్చొనినచోటఁ గూర్చుండకయును, దుఃఖసాగరమునఁ బడిపోయెను. ‘ఆహా! నేనెట్టిపాపాత్ముఁడను. నాయన్న సింధులుఁడు మరణకాలమున భోజుని నాతొడపైఁ గూర్చుండఁబెట్టి సురక్షితుఁడ నయ్యెనని నమ్మెఁగదా! అట్టినమ్మకమును వమ్ముఁ జేసితిని. నాయది మనుష్యజన్మము కాదు. రాక్షసజన్మమే యగును. ఎట్టిక్రూరస్వభావము కలవాఁడైనను ఎదిరినిఁ జంపునేకాని, తనను, తనవారలను జంపనోపఁడుకదా! భోజునియెడ నేను గోముఖవ్యాఘ్రంబ నైతిని. నాజన్మ మేల? క్షత్త్రియకులమును హతముచేసితిని. విక్రమార్కునివంశమును కళంకమునొందించి వైచితిని. నాజన్మము నీవసుంధర నపవిత్రముఁ జేసినది. హా! కుమారా! రాజకులతిలకా! నాయట్టి పాపాత్మునిచే నీ కెంతటి కష్టము సంభవించిదయ్యా? తల్లీ! నీప్రాణమెంతటిబాధ నొందినదో గదా! అయ్యో కుమారా! నాదురదృష్టమునకు మేఱ లేదు. ఇఁక నేమి చేయుదు? ఆదినమున నేను వత్సరాజుహితము నాలకింపక పోయితిని గదా! దురాత్ముఁడను; లోభిని. ఈవార్త నగరమున వ్యాపించినచో, నీధారానగరపు ప్రజలు నన్ను బ్రదుకనిచ్చెదరా? మహామంత్రియై, నాదుకుటుంబపు హితమును గోరుచుండిన బుద్ధిసాగరుని

మంత్రిపదవినుండి తొలఁగించితిని. ఈసమయమున నైన నతని హితమును జై కొందును." అని తలపోసి, యొకసేవకునిఁ బం పి, బుద్ధిసాగరుని దోడ్కొని రా, నాజ్ఞఁ జేసెను,

భోజమాత యగు సావిత్రీదేవి దూడను గోల్పోయిన గోమాత వలె, నోరు మూఁతవడక రాత్రియంతయు కొడు కును పనవి పనవి బిట్టుగా నేడ్చుచుండెను.

బుద్ధిసాగరు నింటికి వెడలినమాత వెంటనే మంత్రిపుం గవునితో ముంజునిగృహమునకు వచ్చెను. ముంజుఁడు విలపిం చుటఁ గని, బుద్ధిసాగరుఁడు ఆవృత్తాంతమును ముంజునివలన విని, యాశ్చర్యభయ సంభ్రమములతో నత్యుగ్రుఁ డై "రా జా! నీవంటిమహాపాతకి ఏలోకంబునను నుండఁడు. శిశుహత్య కంటెను ఘోరపాతక మున్నదా? అట్టిదానిని రాజ్యలోభ ముచేఁ జేసితివి.ఆశిశుహత్యయందును పుత్రఘాతుకుఁడవు. ఛీఛీ! నీముఖముఁ జూడరాదు. సోదరుని వంశమును నశింపఁజేసి, శాశ్వతముగ సింహాసన మెక్కఁగోరి,నిన్ను నీవే హతము చేసి కొంటివి. కా నిమ్ము. ఉదయ మగుటయే తడవు. కాంచికొనుము ప్రజ లీవార్త విని యుడికిపోవుచున్నారు. నీవంశమును, నిన్ను ను, నీమందిరమును నాశముజేయ, వారు సంసిద్ధు లై యున్నా రు. ఓదుర్బుద్ధీ! ఎంతటిపనిఁ జేసితివి! హా భోజకుమారా! నీపిన తండ్రిని నమ్మి, పితృవాత్సల్యముతో నున్నందులకు నీకీగతి సం భవించినదా? ఎట్టికష్టములఁ జెందితివో గదా. తండ్రీ! మే

మిందఱము ఉండియు, నీకు సాహాయ్యముఁ జేయఁజాలమైతిమి కదా! అయ్యో! బలవన్మరణకాలమున నీ వెంతగ విలపించితివో గదా! మే మభాగ్యులము. లేకున్నచో, నీయట్టిమహాపండితుఁడు రాజకార్యధురీణుఁడు, సుగుణాఖని, మ మ్మేడఁబాయునేమి?" యని పరిపరివిధముల నమాత్యశేఖరుఁడు వాపోవుచుండెను. ముంజుఁడు "ఓయమాత్యశేఖరా! నేను నిజముగా మహాపాతకిని. నాముఖ మవలోకించిన మిమ్ము పాతకులనుగా జేయును. నే నింకఁ బ్రజాసమూహమును జూడనొల్లను. ఈమహాపాతకమునకు బ్రాయశ్చిత్తము విధింపుము. నీచెప్పినచొప్పునఁ జేసెదను" అనెను. అందులకు "దీనికిఁ దగినప్రాయశ్చిత్తము చితి నెక్కుటయే! అంతకంటెను దక్కువది మఱేదియు లేదు." అనెను. ముంజుఁడును దాని కొడఁబడి, దేహత్యాగమునకు నిశ్చయించి, చితిని సిద్ధముఁ జేయు బ్రయత్నమున నుండెను. బుద్ధిసాగరుఁడును దానికి సహాయకుఁడుగ నియమింపఁబడెను.

ఇంతలోఁదూర్పున సూర్యోదయసూచనలు గనఁబడెను. భోజకుమారుని కై విలపించుచున్నవో యన నానావిధపక్షిజాలములును గూయఁజొచ్చెను. ముంజునివలెఁ గళావిహీనుఁడైన చంద్రుఁడు వెలవెలఁబోవుచు, ముంజునికృత్యమునకు సిగ్గుపడి మఱఁగిపోవఁ ద్వరపడువానివలె, గనంబడుచుండెను. మహోగ్రుఁడైన బుద్ధిసాగరునివలె నరుణకాంతులతోఁ గూడి, యాలోకబాంధవుఁడగు బాలభానుఁడు దేదీప్యమానముగ వె

లుంగఁజొచ్చెను. అంతదనుక, సూర్యు నుదయమునకై ఎదు రుసూచుచుఁ గాచియుండినప్రజలు మహోగ్రులై, ముంజుని హత మార్తుమని సాయుధులై, గుంపులుగుంపులుగ వీథుల వెంట రా నారంభించిరి. వారలఁ గని, బుద్ధిసాగరుఁడు "మీ సాయము లేకయే ముంజుఁడు, తనంతఁ దానై దేహత్యాగముఁ గావించుకొనఁబోవుచున్నాఁ" డని వారల కెఱిగించి శాంతచిత్తు లఁజేసి పంపివైచెను.

రాజభవనమున బ్రహ్మాండ మగుచితి మండుచుండెను. ముంజుఁడును నెవరిముఖమును జూడకయే యందుఁ బడిపోవ నంసిద్ధుఁడయ్యెను. అట్టియెడ వత్సరాజు నొకకాపాలికునితో నటకరుదెంచి నిలువఁబడెను. కాపాలికుఁడు చేత నొకపుఱ్ఱెఁ దాల్చి మఱి కొన్నిపుఱ్ఱెలను మాలఁగా వైచికొని, యాపాద మస్తకమువిభూతి నలంది జడలు మోకాలినానఁ బొడుకలఁ దొడిగి కౌపీనధారియై, సాక్షాత్సాంబశివుఁడో యన నొప్పె ను. వత్సరాజు బుద్ధిసాగరుని సమీపించి, సురక్షితుఁడైనభోజు ని విషయముఁజెప్పి 'రహస్యముగ నుంపు'మనెను. అంత వారును నాకాపాలికునితో ముంజరాజుకడకు వెడలి "రాజా! ఇతడు మంత్రసిద్ధి గలకాపాలికుడు. ఘోరములగునియమముల నాచ రించి, సిద్ధిఁగన్నవాఁడు. ప్రజ్ఞాశాలి. మీదర్శనార్థ మే తెంచి నాఁడు" అనఁగా-ముంజుఁడు కాపాలికునికి నమస్కరించి "స్వా మీ! మీప్రజ్ఞలేమియో, నాకుఁగల యీకష్టమును తొలగింప

సమర్థు లగుదు రొకో!" యనఁ గాపాలికుఁ డిటు లనెను.

"ఓరాజా! మాకడ ననేక ప్రజ్ఞలు గలవు. మావలనఁ గా నిదేదియు నుండదు. పరీక్షింపఁ దలఁచితి రేని, యట్లుచేయుఁ" డన, "ఓమహాత్మా! నా జ్యేష్ఠసోదరుని పుత్త్రుఁ డగు భోజకుమారుఁడు ఖడ్గనిహతుఁడై మరణించినాఁడు. వానిని పునరుజ్జీవింపఁ జేయవలయును. ఇందుల కేమేమి వలయునో వాని నన్నియు సిద్ధముచేయుటకై ఎట్టి యభ్యంతరమును లేదు. మీ రట్లుచేయ నైతి రేని, నే నీచితియందు దేహత్యాగముఁ గావించికొందు" ననఁగా "తప్పక చేయుదును. ఇది యేమియు మాకుగొప్పపనికాదు. నేటిరాత్రి శ్మశానవాటికయందు హోమము చేయవలయును. హోమము మిగుల రహస్యముగాఁ జరుగఁదగును. అచ్చటికి జను లరుదెంచి రేని నేకాంతమునకు విఘ్నము నొనర్చినచో, హోమము సంపూర్తిఁ జెందనేరదు. వారలును పైగా భేతాళాదిగణములచేఁ గబళింపఁబడుదురు. కనుక జాగ్రత్తగా హోమద్రవ్యమును వత్సరాజుచేత నిచ్చుటకుఁ బంపుఁ"డని యటనుండి వెడలిపోయె, రాజు బుద్ధిసాగరునివత్సరాజును కాపాలికునికిఁ దోడ్పడ నందు నియమించి చితి నార్పఁ జేసి యర్ధరాత్రమున కెదురుసూచుచుండెను.

ఇంతలోన సూర్యుఁడు కాపాలికుని హీనామార్గ్గమునఁ జూడనొల్ల ననునట్టులుగ నస్తగిరి డాఁగెను. గాఢాంధకారము ధారానగరమును ఒక్కత్రుటిలోఁ గ్రమ్మెను. కాపాలికుఁడును

స్నానాదిసాంధ్యకృత్యములఁ దీర్చి, శ్మశానకాష్ఠమునకు వెడలెను. వత్సరాజు హోమద్రవ్యములతోను భోజునితోను నతనివెనువెంటఁ బ్రచ్ఛన్నముగాఁ బయలుదేఱెను. బుద్ధిసాగరుఁడును నటఁ బ్రత్యక్షమయ్యెను. కాపాలికుఁడు మణుఁగుల కొలఁదిగ నాజ్యమును హోమకుండమునఁ బ్రవహింపఁజేసెను. హోమాగ్నిజ్వాల లాకసము నొఱయుచుండెను. పట్టణములోని జనులు 'గతించినభోజుఁడు బ్రదుకునా?' యని యనుకొనుచుండిరి. ఇంతలో రెండవయామము ప్రవేశించినది. హోమకుండమునుండి భోజుఁడు లేచివచ్చె నని కలకలము పుట్టెను. అది యప్పుడే రాజమందిరమునకుఁ బ్రాఁకెను. ముంజరాజును నత్యానందభరితుఁడై కాపాలికునిప్రజ్ఞకు సంతసించుచు, నచ్చోటకు బయలుదేఱెను. ఇంతలోఁ బట్టణ మంతటను నాశుభవార్త పర్వెను. భోజదర్శనార్థము ప్రజ లందఱు నానందభరితులై పర్వ లిడసాగిరి. ముంజుఁడు హోమము జరుగుచున్న చోటికి వెడలి, భోజుఁడుండుటఁ గని బ్రహ్మానందభరితుఁడై సైమఱచి వానిని రెండుచేతులతో నెత్తి యాలింగనముఁ జేసికొని, ముద్దాడెను. ప్రజలును గుమిగూడి కాపాలికుని ప్రజ్ఞను పొగడమొదలిడిరి. ముంజుఁడు భోజుని తనతప్పు సైరింపు మని ప్రార్థించెను. అప్పుడు సావిత్రీదేవికిఁ గల్గిన యానందము నెవరు వర్ణింపఁగలరు? ముంజరాజు కాపాలికునకు విశేషబహుమానముఁ జేయఁదలఁచెను; కాని వానిని గ్రహింపక

యథేచ్ఛ నాతఁడుననియెను. వత్సరాజుతంత్రము ఫలవంత
మయ్యెను. ముంజుఁడు భోజునితోడను, బుద్ధిసాగరాద్యమా
త్యులతోను, పరివేష్టించి, సంతోషమున నోలలాడుచు, నిజ
మందిరమును ప్రవేశించెను.

పిదపఁ గొన్ని దినములకు ముంజరాజు భోజుఁడు వివాహ
వయస్కుఁ డగుటచే అవంతీపాలకుని పుత్రికయును గుణవతి
యను విద్యావతియు, రూపవయోవిలాసినియు నగు లీలావతి య
నుకన్యకను భోజునకు వివాహముఁ జేయించెను. పిదపఁ గొన్ని
దినములకు ముంజుఁడును, సంసారవిరక్తుఁడై, భోజకుమారు
ని రాజ్యమునకుఁ బట్టముఁగట్టి, యతనికి బుద్ధిసాగరుని ముఖ్యా
మాత్యునిగ నియమించి, తనమువ్వురుకుమారులకును గొంత
యాస్తి నిచ్చి పత్నీసమేతుఁడై తపోవనమున కరిగెను.

అనంతరము భోజమహీపతి సింహాసన మధిష్ఠించి నీతిఁ
దప్పక, రాజ్యమును పాలించుచుండెను. ప్రజాసమూహము
భోజునిపాలన కుప్పొంగుచు, రాజభక్తిపరాయణులై మెలం
గుచుండిరి. సకలకలాకోవిదుఁ డగుభోజభూపాలుఁడు తనదర్శ
నార్థ మేతెంచుశాస్త్రజ్ఞులను, కవీశ్వరులను మహోదార
తతో, సత్కరించుచుఁ గల్పవృక్షముపోలె సర్వార్థదాయియై
భాసిలుచుండెను. పట్టమహిషి యగులీలావతియును, తనదురూ
పవయోవిలాసములచే భర్తను దృప్తిపఱచుచు, భోజభూపా
లునకు నాయామంత్రాంగముల సమయోచితముగఁ దోడ్ప

డుచు రాజ్యపాలనమున సాయపడుచుండెను. ఇట్లు సత్ప్రభుఁడై యాచక కల్పవృక్షమై పండిత ప్రకాండులపాలిటి పెన్నిధియై, శత్రురాజమత్తేభములకు సింహమై, కవిజనచకోరచంద్రుఁడై యుండి, సింధులపతిని సుగుణగణముల సన్నిరీతులను మించెను.

ఇటులుండఁగాఁ గొంతకాలమునకు లీలావతీదేవి గర్భవతి యయ్యెను. రాజ్యములోని సకలప్రజలును ఈశుభవార్త విని, యానందభరితులైరి. భోజభూపతియు నందుల కానందించుచుండెను. లీలావతియును గర్భము క్రమముగఁ దొమ్మిది మాసములునిండఁగాఁ బదియవమాసమున నొకదివ్యముహూర్తమున స్త్రీసంతానమును గనెను. అంత రాజును యథావిధిగ జాతకర్మము మున్నగు నర్హసంస్కారములఁ జగిపి శారద యని యామెకు నామకరణముఁ జేసిరి. ఆనూతనదంపతుల యానందమునకు మేఱలేదు. ప్రజలును భోజసతికిఁ బుత్త్రిక జన్మించినందులకు సంతసించి, యుత్సవాదులజరిపిరి. ఆనాఁడు ధారానగరమంతయు నపూర్వశోభతో నిండెను. శారదయు దినదినప్రవర్ధమానయై, యాదంపతులకును, సఖీజనమునకును అవ్యక్తమధురవచనములనానందము నినుమడింపఁ జేయుచు, ముద్దులొలుకుచు సంతసమును గలిగించుచుండెను. క్రమముగా శారద శైశవముమీాఱి బాల్యావస్థ నొందినది. భోజుఁడును తన పుత్త్రిశారత్నమునకు సుముహూర్తమున నక్షరస్వీకారమును జేయించి, విద్యాభ్యా

సము జేయించి యొకసద్గురువును నియమించి, తాను నప్పుడపుడు తనపుత్రికావిద్యాభ్యాసమును జక్కఁగఁ గమనించుచుండెను. సూక్ష్మబుద్ధి గలశారదయును, గుర్వాజ్ఞ నతిక్రమింపక, నియమప్రకారము గురునియెడ భక్తిఁగలిగి, విద్యాభ్యాసముఁ జేయుచుండెను. క్రమముగఁ గొన్నివత్సరములకు శృంగారాది నవరసభరితము లగు కావ్యములును నాటకములును నానావిధ మగునలంకార శాస్త్రములును అర్థశాస్త్రాదులను జదివి తనగురువుకంటె నధికప్రజ్ఞ గల దయ్యెను. కవిత్వమునను, సంగీతశాస్త్రమునందును ప్రత్యేకప్రతిభను గడించి, జనకునకు సంతసమును, గురువునకు గొప్పకీర్తిని కలుగ జేయున దయ్యెను.

క్రొన్నెలవంకయో మరుఁడు గోరికఁ బెంచిన గోరువంకయో
కన్నియజాజితీవియయొ కంతుని చేడియతోటమావియో
చిన్నెలప్రోకయో సరసఁ జేరినగొజ్జఁగినీటి వాఁకయో
వన్నెపుదివియో యనఁగ భోజసుతాత్మజ యొప్పు నీటునన్

ఇటులు క్రమముగ సకలవిద్యలయందును ప్రౌఢగాంచిన శారదకు నిజసుందరాకారమునకుఁ దోడు నవకోమలమును సంప్రాప్త మయ్యెను. ఆమెను వర్ణింప నేరికి శక్యము? ఆ సుందరికి—

సీ. సానఁబట్టిన పుష్పచాపుని నునువాఁడి
తూఁపులో యనఁ గల్కి చూపు లమరె,
నెక్కుపెట్టినయట్టి యిందిరాసుతువింటి
విభ్రమంబులు మీరె సుభ్రూభామలు,

పస మించఁ దుడిచినకుసుమబాణుని రత్న
దర్పణం బవదగెఁ దరుణిమోము
పై కెత్తినట్టి దర్పకుని గోల్లైనహేమ
కలశంబు లన నొప్పె నెలఁదిచనులు

తే. లతనుఁ డఖిలజగంబుల నాక్రమింప
వెడలుచోఁ జేత నెత్తిన విజయశంఖ
మనఁగ రేఖాత్రయంబుతో సమరె గళము
నళిననేత్రకు నవయౌవనంబు గదుర.

చ. కనకలతాసమాన మగుగాత్రము చంద్రునిఁ బోలువక్త్రముం
వినుతనవప్రవాళరుచి విభ్రమముల్ మృదుపాద పద్మముల్
ఘనశిఖిరాట్కలాపభరకాంతము క్రొవ్వైద ముద్దుపల్కులుం
వినవిన వేడ్కలౌ నధరవిద్రుమ మత్యరుణాభ మింతికిన్.

సీ. సారంగముల మీఱు సారంగముల గేరుఁ
దొయ్యలి కొప్పు గన్దోయి యొప్పు
పున్నాగముల నెంచుఁ బున్నాగముల నొంచు
నలినాస్యగతి సొంపు నాభిపెంపు
చంద్రఖండము నేలుఁ జంద్రఖండముఁ బోలు
సుదతిచెక్కులలాగు నుదుటిలాగు
కాంచనంబు హరించుఁ గాంచనంబు హసించుఁ
దరళలోచన నాస తనువిలాస

తే. మవుర యీముద్దుచెలిఁ బొందినట్టివాని
భాగ్య మెన్నంగవశమె యాపద్మభవుఁడు
దీని సృజియించువేళ వాగ్దేవి నెదుట
నుంచుకొని చేసెఁగాఁబోలు నొండు గలదె?

వ. మఱియు.

తే. దివ్యచేతను సౌందర్యవిభవమునను
ధాత యిట్టియవ్యాజ సుందరిని జేసి
విషము పూసిన బాణంబు వేటొకండు
పంచబాణున కిపుడు కల్పించె దాను.

మహాసౌందర్యమునకుఁ దోడు యౌవనప్రాదుర్భావ మును, విద్యావినయసంపన్నతయును దోడై శారదను సాక్షాత్తు శారదయే యనిపించుచుండెను.

ఇట్టిమహాసుందరమూర్తిని గనిన మహీపాలుని సంత సమునకు మేఱయుండునా? ఒక్క సౌందర్యమే కాదు. ఆమె యెడ విద్యావినయాదులగు సకలసద్గుణములును నిండి యుండెను. భోజభూపాలునకు నిఁకఁ గర్తవ్య మేమి? తనపుత్రి కకుఁ దగినవరుని అన్వేషణ సేయుటయే కదా! సకలసద్గుణ ములు నిండిన దన యేకపుత్రికకు దగినవరుఁడు లభించుట దుర్ఘటము కాదా? ఎందఱో మహీపాలకుమారు లున్నను వరాన్వేషణను జాగరూకతతోఁ జేయవలసివచ్చినది. విద్య యుండినచోట, శౌర్య ముండదు. శౌర్యమున్నచో, నంద ముండదు. అందమున్న సరసత పూజ్యము. ఇట్లు లోకదాని కొకటి విరుద్ధమై యుండెను. కొలదిమాసములు వరాన్వేషణ మొనరించి, యతఁడు అనురూపవరునిఁ గానలేక విసిగిపోయెను. తుద కొకనాటిరాత్రి భోజమహీపతి విచారగ్రస్తుఁడై శయ్యపైఁ బవ్వళించి వరాన్వేషణచింతతో నిదురించెను. ఆనిదురలోనే

యొకస్వప్నముఁ గనెను. వెంటనే లేచి, పాదప్రక్షాళనముఁ జేసి, యాచమనాదికృత్యములం దీర్చి హరినామస్మరణముఁ జేయుచు సూర్యోదయమున కెదురు చూచుచుండెను. సూర్య భగవానుఁడును భోజునంతటి సరసవిద్యావిలాస భాసురునిఁ దపింపఁజేయఁగూడ దని యెంచినట్లు ఉదయాద్రిని సత్వరముగా నరుణకిరణములఁ బ్రసరింపఁజేసెను. భోజుఁడును అంతకుముందే లేచి, కాల్యకృత్యములఁ దీర్చికొని, సభామంటపమునకు బయలుదేఱెను. అప్పటికే యట నాసీను లై యున్న ప్రధానామాత్యులతో తన స్వప్న వృత్తాంతము నిట్లు చెప్పఁ దొడఁగెను.

"ఓయమాత్యశేఖరా! నిన్నటిరేయి వరాన్వేషణ విషయ మై యొకకలఁ గంటిని. అదే దందువేని 'ఓ భోజా! నీవు పుత్రికావివాహవిషయ మై చింతాక్రాంతుఁడ వై యున్నాఁడవు. ఇపుడు నీవుచేయుచున్నవిధమున శారదకుఁ దగిన వరుఁడు లభించుట దుస్సాధ్యమే యగును; కావున నేఁజెప్పు నుపాయముప్రకారము చేసితివేని తగినవరుఁడు సులభముగ లభింపఁగలఁడు. అది యేమందు వేని, ఒకసుందరభవనమును నాయాలయమునకును నీసౌధమునకును మధ్యను నిర్మింపవల యును. అది సప్తప్రాకారయుతమును, ఇఱువదియాఱుద్వార ములతోను కూడి, సుందరముగ నుండవలయును. ఆద్వార ములు ఒకదానికంటె నొకటి చిత్రవిచిత్రములతోను విచిత్ర

శిల్పతంత్రచాతురీపూర్ణముగను నుండవలయును. ప్రథమ ద్వారమున నిద్దఱు వార్తాహారిణుల నుంచవలయును. రెండవ ద్వారమున మనుష్యాకృతి గలకీలుబొమ్మల నిర్మింపవలయును. పిదప వ్యాఘ్రమును భల్లూకమును, మదపుటేనుఁగులు, వానరములు, వేటకుక్కలు, క్రమముగ ద్వారముల కుంచవలయును. వానిపిదప ద్వారమధ్యమున, శిల్పతంత్రయుత మగు నొక నూయియు, దాని ప్రక్కద్వారము రక్తవర్ణసహితమగుపంకముతోను, దానియందడుఁగిడి దాఁటినపిదపఁ గాలుఁదిగ కాళ్ళు శుభ్రపఱచుకొనుటకు పన్నీటిని వెండిపాత్రమున నుంచి యావలిగట్టున నుంచవలయును. దానిపిదప భారతరామాయణాది ప్రాచీనచిత్ర కథలు చిత్రింపఁబడి, కన్నులపండువుగ నుండు చిత్రమండపమును, దానిపిదప జలమధ్యమండపమును, దాని వెనుక స్ఫటికమహామణులతో నిర్మింపఁబడిన మండపమును, విద్యావినోద, సంగీత, సాహిత్య, నర్తనాది విలోకనమండపములును క్రమముగనిర్మింపఁగావలయును. దానియనంతరము కోడిపుంజుల పందెపువాకిలియు, జెట్టిపోట్లాటల నడపువాఁకిలియును, పిదపం బొట్టేళ్లు ఢీకొను ద్వారమును, నాటకశాలలను నిర్మింపవలయును. దానికిఁ బిదప విశాలచతురశ్రస్థలమున మిగుల నలంకారశోభిత మగు సభామండపమును నిర్మింపవలయును. దాని మధ్యమున మదకరిదంతములతో నిర్మించిన తూఁగుటుయ్యేలల మంచములు స్త్రీకి వేఱుగను, పురు

షునికి వేఱుగను నిర్మింపవలయును. దానియందు తలగడ యిది యనియుఁ గాలికడయిది యనియుఁ దెలిసికొన లేక యుండు విధమున దానిని నిర్మింపవలయును. తలకడను నిలువుటద్దమును, కాళ్లకడను కీల్బొమ్మలను నుంచవలయును. ఆతూలికయందు తలగడ నెక్కిఁ పరుండెనేని, కాళ్లకడనుండు కీల్బొమ్మలు కాలొత్తుటయుఁ జేతులొత్తుట, వీవనలు విసరుట, తములమిచ్చుట, మొదలగు సపర్యలఁ జేయునట్లు యంత్రసాహాయ్యముచే నిర్మింపవలయును. తలకడను తెలియక పరుండినచో, నాబొమ్మలు తలఁబట్టి యీడ్చుటకును, కాలువట్టి యీడ్చుటకును, దీపస్తంభము నెత్తినిం బెట్టుటకును, తగునట్లు నిర్మింపవలయును. దానివెనుక నీరీతినే చాల శృంగారకళలను తంత్రవిలసితములు అగుకళలను నిర్మింపఁజేయుము. ఇవ్విధమున భవననిర్మాణ మైనతర్వాతను, సకలదేశములకును దేశపాలకులకును నొక ప్రకటనపత్రిక నంపుము. దానిలో నిటులు వ్రాయుము— ధారాధినాథుఁడగు భోజభూపతికొమరిత యగుశారదను ఏరాజపుత్రుఁడు సకలవిద్యలయందును జయించునో, యట్టివారి కాకన్యకామణి నిచ్చి వివాహముచేసెదరు. జయింపలేనిచో నొకదినమునకు నేయివరహాలవంతున నపరాధముఁ జెల్లింపవలయును" అని. ఇట్లు సకలరాజులకును చాటఁబంపుము. కాని యెందఱో రాజకుమారులు రాఁగలరు. వారెవ్వరును వాదమున నామెను జయింపలేరు. తుదకు కాళి

దాసనుమహాకవి సహాయముతో శృంగారపురపు రాజకుమారుఁడు రాఁగలఁడు. వాఁడే నీపుత్రికను జయింపఁగలఁడు. వానికే నీపుత్రిక నిచ్చి వివాహముఁ జేయింపుము. ఇట్లు చేయవైతివేని నీవు మనోరథసిద్ధినిఁ బడయఁజాలవు'' అని భువనేశ్వరీదేవిపలికినటులు కలఁగంటిని. నీవు బృహస్పతిఁబోలిన మహామంత్రివి కదా! కనుక నిందులకు దగినయుపాయముఁ జెప్పుము." అనెను.

అనంతర మాప్రధానామాత్యుఁడును రాజువాక్యములను విని, "ప్రభూ! తమకల నిజమే యగు నని తోఁచుచున్నది. ఇం దసత్య ముండఁబోదు. భువనేశ్వరియే యీవిధమునఁ బలికి యుండ నోఁపు. ఆనుడువుల నతిక్రమింపక యటులేఁ జేయవలయును. అదియే కర్తవ్యము" అని చెప్పెను. రాజును దానికి సమ్మతించి యటులే చేయ ననుమతించి, ముందుగ భవననిర్మాణమున కాజ్ఞఁ జేసెను.

పిదప రాజాజ్ఞప్రకారము ప్రధానామాత్యుఁడు కొన్ని దినములకు భవననిర్మాణమును చేయించెను. భోజుఁడు పుత్రిక యగు శారదాదేవినం దునిచి, విద్యావతులును చతురలును నగుసఖీజనులను జాగ్రత్తగ నుండ నియమించెను. భోజభూపతియు నపుడపు డచటకు వెడలి క్షేమ మారయుచుండెను. ఇట్లు కొన్నిదినములు గడవఁగా, రాజపుత్త్రిలు క్రమముగ సీసమాచార మెఱింగి ఒకరొకరే రా నారంభించిరి.

---

# శృంగార కాళిదాసు.

## ద్వితీయ ప్రకరణము.

---

భరతశాస్త్రిసంగీతశాస్త్రినాట్యశాస్త్రిములకు భరత మహాముని కర్త. ఈముని దేవసభలో నాట్యప్రణేత యగు ప్రధాననటకుఁడు. దివ్యములును, మానుషములు నగు పుణ్య చరిత్రముల నాటకముల రచించి, దేవసభలో రంభాదులగు దేవవేశ్యలచే నాట్య మాడించువాఁడు. ఇట్టి భరతముని యొకానొకప్పుడు శ్రీమన్నారాయణుని మోహినియవతారము ను నాటకముగ రచించి, దేవవేశ్యలచేఁ బ్రదర్శనముఁ జేయిం చెను. ఆనాటకమునకుఁ బ్రేక్షకులుగ దేవేంద్రునియాహ్వానము నంగీకరించి, త్రిమూర్తులును వసిష్ఠవిశ్వామిత్ర, దుర్వాసాదుల గు దేవర్షి రాజర్షి బ్రహ్మర్షి గణములును, సిద్ధసాధ్యవిద్యాధరకిన్న రకింపురుషాదులును, వారు వీ రననేల? సకలదేవతలును విచ్చేసి యుండిరి. కథానాయికపాత్రమును పుంజికస్థల యనునప్సరస ధరించెను. కథానాయకపాత్రమును పుంజికస్థలప్రియమునకుఁ బాత్రుఁడైన హంసుఁ డనుగంధర్వుఁడు ధరించి సభాసదుల మెప్పించెను. దేవసభలోని నటకుఁ డగుభరతమహాముని చాతుర్య మునకును, పాత్రధారుల చతురతకును సభాసదు లందఱును హర్షించిరి. రంభాదినటీజనులు కథానాయికనటనకు నాచాతుర్య మునకచ్చెరువడి, సిగ్గుఁ జెందిరి. వా రద్దానిని నాటకమని, తలం

పక మోహినినిఁజూచిన శంకరునివలె, ఆప్రేక్షకులును భ్రమ
సెంది నిశ్చేష్టులైరి. పరమేశ్వరుని కామవికారమును సూచించు
రంగమును ప్రదర్శించునపుడు, దుర్వాసు నంతటితపోధనుఁడు
సైతము తనమనసును నిలుపలేక వికృతచేష్టలఁజేయఁదొడగెను.
క్రమముగ దుర్వాసునికి మనసు నిలుకడ సెడెను. పిచ్చియెత్తి
నవానివలె నతఁడాసనమునుండి లేచి, త్రిమూర్తు లున్నారని
యు జంకక పుంజికస్థల నటించుస్థలమునకుఁ బరువెత్తెను. అం
తకుముందే, దుర్వాసునిచేష్టలఁ జూచుచుండినకథానాయిక,
తటాలున దుర్వాసునికి దొరకక, శంకరవేషముతో నున్నతన
ప్రియునిఁ గౌఁగలించుకొని, రక్షింపవేఁడెను. అపుడు సభలోఁ
గలకలము కలిగెను. కొందఱు దుర్వాసుని నిందించిరి. కొంద
ఱు పుంజికస్థలభీతికి వగచిరి. అపుడు బ్రహ్మవామభాగమున
నాసీన మై యున్నభారతీదేవి దుర్వాసుని మనోదౌర్బల్య
మునకాశ్చర్యముఁ బొంది పక్కున నవ్వెను. దూర్వాసమహర్షి
కుపితుఁ డయ్యెను. సభలోనికలకలము ద్విగుణీకృత మై యా
నాటక మంతతోనే ముగింపవలసి వచ్చెను.

ఎంతయోశ్రమపడి దివ్యమగునాటకము రచించి, చ
క్కఁగ నటనఁజేయింపవలె నని యాసతోనున్నభరతమునిప్రయ
త్నమునకు దుర్వాసుఁ డనుపర్వత మడ్డువచ్చెను. భరతము నికి
పుంజికస్థలమీఁద మిక్కిలి కోపము కలిగెను. దాని నాఁపుకొన
లేకయావేశపరవశుఁడై "ఓపుంజికా, సహస్రసంఖ్యాకు లగు

సభాసదు లుండ, ఈమహార్షి నిన్ను భక్షించు ననుకొంటివా? రక్తిగట్టుసమయమున నాటకమును పాడుసేసితివి కదా! దీని ఫలముగ నీవు భూలోకమున మనుష్యాంగన వై పుట్టుదువు గాక" యని కను లెఱ్ఱజేసి శపించెను. నాటకము శాపముతో నంతమందసాగెను. తన్నుజూచి భారతి నవ్వినందులకాదుర్వాసుండుగ్రుండై "ఓసరస్వతీ! సృష్టికర్త యగుబ్రహ్మదేవుని పత్నివగుటచేతను, సకలవిద్యలకధిదేవత వగుటచేతను మిక్కిలి గర్వించి యుంటివి. లేనిచో నన్ను జూచి నవ్వి యుందువా? ఈపరిహాసఫలితముగ నీవు భూలోకమున బ్రాహ్మణపుత్రుండై జన్మించి, కిరాతసంసర్గముచేఁ గిరాతుఁడ వగుదువుగాక! అంత్యమున నీచస్త్రీచే మరణింతువు గాక!" యని శాప మిచ్చెను. శారదాదేవికి ప్రియసఖి యగుసావిత్రి తనదేవికి సంభవించిన శాపమునకు కుపితురాలై దుర్వాసునిఁజూచి యిట్లు లనెను. "ఓకోపమూర్తీ! నీవు పుంజికస్థలను జూచి కామమోహితుఁడవై నాటకమును జెఱచుటయేకాక, నీవికారచేష్టలకు నవ్విన మహాదేవి యగుశారదాదేవికిని శాపము నొసంగఁబూనితివి కదా! ఇంతటిమహార్షి వై యుండియుఁ ద్రిమూర్తులు సయితము మిటుఁ గూడియున్నారని యైననుదలఁపక, అవమానమును స్మరింపక, యింతటి నీచకార్యమును చేసి, పైపెచ్చు శాపమొసంగ వెనుదివియ వైతివి. అందులకుఁ బ్రతిఫలముగ నీవుభూలోకమున నొకరాజునకుఁ బుత్రికగజనించి, యాకిరాతునకు భార్య వై

సంసారసుఖ మనుభవింపకయే దుఃఖముపాలై దీనమరణము నకు గుఱియగుదువుగాక" యని ప్రతిశాపమిచ్చెను. శారదయు దుర్వార మైనమహర్షి శాపమునకుఁ గుందుచు, పతిపాదముల పైఁబడిమూర్ఛిల్లెను. ఆభారతీనాథుఁడును పత్నీవియోగమునకు దుఃఖింప మొదలిడెను. అటులు చింతించుచున్నయాపురాణదం పతులఁ జూచి, సభాస్తారు లందఱు జాలివడిరి. ఇటులు క్రమ ముగ రచ్చలకు లోనైసభ కలియఁబోవుసమయమున శ్రీమ న్నారాయణుఁడు లేచి, సభాసదులఁజూచి యిట్లు పలికెను.

"ఓ పురాణదంపతులారా! సభాసదులారా! మహర్షుల యొక్కయు, దేవతలయొక్కయు వాక్కులనుండి వెలువడిన వాక్యము లారీతినే జరిగితీఱును. గతమునకు విచారించిన ఫల మేమి? ఇది నామాయయే యగును. ప్రస్తుతము భూలోకమున సంస్కృతభాష క్షీణించిపోయినది. సంస్కృతభాష క్షీణించుట యనఁగా జ్ఞానశూన్యమగుటయే యగును. సకలశాస్త్రములును, పురాణములును సంస్కృతముననే కలవు. భాషాప్రచారము తగ్గుటచే జ్ఞానమును తగ్గుటయే యగును. అందుచేఁ బ్రజలు పశుప్రాయు లగుదురు. ధర్మభ్రష్టు లగుదురు; కావున నీభారతీ దేవి భూలోకమున జన్మించుట యావశ్యకమే యగును. సంస ర్గముచేఁ గిరాతుఁడైనను కిరాతత్వము స్థిరముగ నితనికినుండదు. పురుషరూపముఁ దాల్చినశారదయే యగును. ఓవిరించీ! భా ర్యావియోగమునకై వగవకుము. నీభార్య కాళికావరప్రసాద

మునఁ గాళిదాసుఁడను పేరఁ గొప్పకవి యగును. నీవు భూలోక
మున విక్రమార్కునివంశమున సింధులునకుఁ బుత్త్రిఁడ వై
జన్మించి, నీతిఁదప్పక రాజ్యమును పాలించుచుఁ గాళిదాసున
కాశ్రయభూతుఁడ వై వెలయుము. సరస్వతికిఁ బ్రియదాసి య
గుసావిత్రి నీ కిల్లా లై లీలావతి యనునామముతో విరాజిల్లును
గాక! పుంజికస్థల వేశ్యాంగన యై జన్మించి కాళిదాసునకు బ్రి
యురా లగును; గాన దుర్వాసుఁడే అగ్నిసాక్షిగాఁ బరిణయ
మైనరాకుమారిత యగుగాక! ఇదియ మాయాజ్ఞ. ఇది జరిగియె
తీఱవలయును." అని శ్రీమన్నారాయణుఁ డుపన్యసింపఁ బ్రేక్ష
కులు హర్షధ్వనులు సేయుచు నెవరిదారిని వారు పోయిరి. అం
తటితో నాటకప్రదర్శనమున కై యుపక్రమింపబడినట్టి యా
నాటకమును సంపూర్ణ మయ్యెను.

అనంతరము భగవంతుని యాజ్ఞప్రకారము దుర్వాసుఁ
డు వంగదేశపాలకుఁ డగు సత్యవంతుఁ డనురాజునకు ఏకైకపు
త్త్రికగ జన్మించెను. కుమారిజననమునకు సత్యవంతుఁడు సం
తోషించి, మిక్కిలి గారాబమున నాశిశువును పెంచుచుండెను.
దానికి చంపకకలిక యని సుందరనామ మిడి సంతోషించు
చుండెను. విద్యాభ్యాసమునకు దగినవయసు వచ్చినతోడనే
సర్వశాస్త్రపారంగతునొకని నియమించి చంపకలికకు విద్యను
గఱపించుచుండెను. గొప్పమేధావిశేషము గలచంపకకలికయు
నాగురువునొద్ద విద్యాభ్యాసముఁ జేయుచు, యావనప్రాదుర్భా

వమునకుఁ బూర్వమే సకలకళల నభ్యసించి, తలిదండ్రులకు సంత
సము నొడఁగూర్చెను. వంగదేశవిభుఁడును దనయేకైకపుత్రి
కకు సకలకళల నేర్పిన యావిద్వాంసునకు గురుదక్షిణ నిచ్చుట
కొఱకు నొకశుభదినము నేర్పఱచి, యానాఁడు చంపకకలికకు
మంగళస్నానముఁ జేయించి, చీనిచీనాంబరముల దాల్పఁజేసి
సర్వాభరణభూషితం జేసి, సఖీజనముతో గురునికడకు సకల
సామగ్రులతోఁ బంపెను. మంగళవాద్యములతో రాజభవనము
నుండి బయలుదేఱిన యాచంపకకలిక గురునిగృహమును జేరి,
తనరాకను గురుని కెఱుకపఱచి, గురుసందర్శనమున కెదురుసూ
చుచుండెను. కొంతసేపటికి ఆగురువులునురాఁగా, నాయన
పాదములకడఁ దాఁదెచ్చినపళ్లెరములలోని స్వర్ణాభరణములును,
రత్నహారములును నుంచెను. వానిని చూచి యావృద్ధగురువు
మోహావిష్టుఁడై కపటముతో నిటు లనెను. 'ఓచంపకా! నీ
భక్తికి మెచ్చితిని; కాని ఈయాభరణములతోను, ఈకాంచన
వస్త్రములతోను నాకుఁ బనిలేదు. నీ నిరుపమానలావణ్యముఁ
జూచినదిమొదలు నామన సీయాభరణములపైఁ బోవుట లేదు.
నీనిరుపమానసౌందర్యమే న న్నాకర్షించినది. నామనసు నీ
లావణ్యమునందే గాఢముగ లగ్నమైనది. కావున నీవీయాభర
ణములతో నన్నుఁ దృప్తిఁబొందింపఁజాలవు. నన్ను నిజముగఁ
దృప్తుఁజేయఁదలతువేని బిగియార నన్ను నొకసారి కౌఁగలింపఁ
జేసి,ముద్దాడనిమ్ము. అదియే నీ వీయగల గురుదక్షిణయగును.

అదితక్క మఱేవియు నన్నుఁ దృప్తునిఁ జేయలేవు" అని చెప్పి యీరాజకన్యకను సమీపింపఁబోయెను. ఈమాటల విన్న చంపకకలిక అత్యుగ్రయై కంఠెత్తుసేసి గురునితో నిటు లనెను. "ఓస్వామీ! మీరు నాకు సకలవిద్యల నేర్పదగిన గురువుల రైతిరి. నాకు తండ్రితో సమానులరు. నేఁబుత్రికవంటిదానను. అటులుండ సకలవిద్యాపారంగతు లైనమీ రిట్లుపలుకుట ధర్మ మగునా? దయతో నే నిచ్చుదక్షిణలను స్వీకరింపుఁడు" అన విని యీగోముఖవ్యాఘ్రము కామపు వెఱ్ఱి తలకెక్కఁ దడబడుచు, రాజకుమారికను కౌఁగలింప సంసిద్ధుఁడై పరుగిడెను. అది కని చంపకకలిక యవతలికి జాఱి తప్పించుకొనెను. అతఁడును పిచ్చెత్తినవానివలె చేతులఁజాచుచు వెంటఁబడెను. తప్పించుకొన దారి లేక, కెవ్వున కేక వైచెను. అదిగని గురువు భయపడి యూరకుండెను. ఇంతలో రాజకన్యక కేకలను విని, ఆమె దాసదాసీజను లచ్చోటికిఁ బరుగున వచ్చిరి. దానిని మఱుగువఱచఁ దలఁచి రాజకన్యక యీదాసీజనములతో గురుచర్యను జెప్పిన నపాయము గలుగు నని యూహించి, యచట బ్రహ్మరాక్షసుఁ డున్నట్లు తమ గురువుగా రిదివఱకు జెప్పి యుండినను, మీసాయము గోరనైతి నని అదియే యిటఁ దన్ను బెదరించినదని, అందుచేతనే తానుభీతిలి కేకలిడితి నని ఇంతలో మీరు వచ్చితిరి. కనుక నింకఁ దమసదనమునకు వెడలుద మని చెప్పి యటనుండి రాజభవనమునకు వెడలిపోయెను.

ఆహా! యీరాజపుత్రిక యెంతటి యుదారహృదయ. అపరాధినిసైతము, శిక్షింపవీలుగల్గియు మన్నించుట సామాన్య కృత్యముకాదుగదా! గురు వంతటియపచారముఁ జేసినను క్షణములో మఱుగువఱచినది. గురున కెట్టియాపదయు రాకుండఁ గాపాడెను. దయాశూన్యుఁ డగునాపండితుఁడు ప్రజ్ఞానరహితుఁడై యెంతమాత్రమును భయములేక రాజకుమారిని మోహించెను, కాని యది చేతి కందగల ఫల మగునా? చేతి కందనిదే యగును. అట్టిదానికి చేతులఁజాచిన నిష్ఫలమే గదా! చంపకకలిక నిజమును దాఁపకున్న గురువుగతి యే మగునో కదా! కామ మెంతటిపనినైనఁ జేయింపఁగలదు. దానికి మంచిసెబ్బరలు గాని, యుక్తాయుక్తవివేచన గాని, పుణ్యాపాపముల విచక్షణ గాని లేదు. అందునను మహాపండితులయందిట్టియల్పభావముండుట చాల నీచ మగును. మహావిద్వాంసుఁడును, వృద్ధుఁడును నైనయాపండితునిబుద్ధి ఎంతటి నీచకార్యమునకొప్పె! మహాపాతకమనియైన యోచింపలేదు గదా! ఇట్టిమహానుభావు లుండుట భూమికి భారమే గాని మఱేమియుఁ గాఁజాలదు. ఇట్లు గురునితప్పును సైరించి క్షమించి రహస్యముఁగ నుంచినందులకై కృతఘ్నుఁ డగునాగురువు ఆరాజకన్యక నెట్లైన నొకమూఢాగ్రేసరునకుఁ బరిణయముఁ జేయింతు నని ప్రతిజ్ఞఁ బూని యుండెను. అది రాజపుత్రికకుఁ గాని, రాజునకుఁ గాని సుంతయేని తెలియరా దయ్యె.

ఇటులుండ, నా రాజకన్యక సంప్రాప్తనవయౌవన యయ్యెను. పెండ్లిప్రాయము వచ్చుటచే సత్యవంతుఁడు తనకులము నకుఁ దగినయొకసంబంధమును వెదుక నారంభించెను. విద్యావంతుఁడును, రూపవంతుఁడును గుణవంతుఁడును నగు వరుఁడు దొరకుట దుర్లభ మయ్యెను. ఇటులఁ గొంతకాలము గడవఁగా రాజు విసుగెత్తి యూరకుండెను. అదిగని చంపకకలికకు గురు వగునాపండితుఁడు రాజుతో నిటు లనెను. "మహారాజా! వరాన్వేషణవిషయమై తమతృప్తికిఁ దగినట్లు సంభవింపమికిఁ జింతాక్రాంతులై యున్నటులఁ గనఁబడుచున్నారు. నా కాజ్ఞ నిడినచో, నేను వెడలి దేశదేశములు దిరిగి తగినవరునితోడి తెచ్చెద. నామనవి సమ్మత మగుచో, నాజ్ఞ నిడుఁడు. సుదిన మగునీదినమే బయలువెడలెదను" అన విని మిక్కిలి సంతసించి, ఆరాజుకూడ ఆగురువును వెంటనే వరాన్వేషణకై నియమించెను. పండితుఁడును, తత్క్షణ మటనుండి బయలుదేఱి తాఁబూని నశపథము నేఁడుగదా ఫలించిన దని సంతసించుచు వరాన్వేషణకై యారాజ్యము వీడి చనెను.—

పండితుఁడగు నావృద్ధగురువు అత్యుత్సాహముతో వలసినసామగ్రి నంతయు గైకొని నానాదేశములం దిరిగి, తనమనోరథ మీడేరక విచారగ్రస్తుఁడై మార్గమునఁ బయనము సాగించుచుండెను. ఒకనాఁడు మధ్యాహ్న మగుటచే నెండబాధకోర్వ లేకయతఁ డొక చెట్టుక్రింద కూలఁబడి, యిట్లు వితర్కింపఁ

జొచ్చెను. "ఇన్ని దేశములు దిరిగియు రూపవంతుఁడును విద్యా శూన్యుఁడు దరిద్రుఁడునగు మోటుమానిసి యొకఁడును దొరక లేదు గదా! ఇఁక నేమి చేయుదు? నాయభీష్టము నెఱవేఱుట యెట్లు? ఎన్ని యోపట్టణములు పల్లెలు వెదకియు లాభము లేక పోయెను. ఇఁక వెదకవలసినచో టేదియు లేదు. ఫలశూన్యుఁడ నై నిజావాసమును జేరికొనుటయే కర్తవ్యము. ఫలరహితుఁడనై మరలిననేమి ప్రయోజనము? నాకోపమునకు శాంతి యెక్కడిది?" అనియాలోచించుచుండ, నిరువురు బాలురు, విద్యాగురు వృక్ష స్థలమునకు వచ్చుచుండిరి. అందొకఁడు సుందరుఁడై యుండెను. మఱొకఁడు కొంతవికారరూపముతో నుండెను. సుందరకుమా రుఁడుచక్కని యవయవములు గలిగి, రాజకుమారునివలె గన్పిం చుచుండెను వానిమాటలుమాత్రము వానియజ్ఞానమును చా టుచుండెను. రెండవవాఁడు ఎఱుకవారి పిల్లఁడివలెఁ గానిపించు చుండెను. ఇరువురును విద్యాగురు వృక్షస్థలమును సమీపించి యొక చెట్టునెక్కి, కొమ్మలఁగొట్ట మొదలిడిరి. మొదటివాఁడు, కొమ్మనెక్కి దానినే నఱకుచుండి గుబాలున క్రిందఁబడెను. దా నిఁగాంచినయాగురువును, మనమున గొంత సంతసముఁ బొడ మ, వానినిగమనింపమొదలిడెను. మరల నాబాలుఁడు చెట్టెక్కి పూర్వమువలెనే చేయుచుఁ గొమ్మతో గూడ మరలఁ గ్రిందఁబడెను. ఇట్లు పడుచున్న యా సుందర బాలకునిం బిలిచి, తనలో నిట్లు లను కొనెను. ‹వీఁడు సర్వలక్షణ

శోభితుఁడై యున్నాఁడు. నవ్వుమోము, ఆజాను బాహువులు, విశాలవక్షస్థలము, అవయవసౌష్ఠవము, పద్మనయనములు, వీనిని రాజకుమారునిఁగ సూచించుచున్నవి; కాని పాండిత్యమునూచిన నిరక్షరకుక్షివలె గనిపించుచునే యున్నాఁడు. వీఁడే రాజకన్యకకుఁ దగినవరుఁ డగును. వీని నెట్లయినఁ దీసికొని పోవలయును" అని తలఁచి వానితో నిటులనెను. "ఓరీ బాలకుఁడా! నీ వెవఁడవు? నీ కులమేమి? నీ తలిదండ్రు లెవరు? నీకాపుర మెచ్చట?" యన వాఁడందుల కిటులనియె:—"అయ్యా! నాతలిదండ్రు లెవరో నాకు దెల్వదు, నాదీవ్రా రేను." గురు నామాటలాలించి "ఓరీ నా వెంట వచ్చెదవా?" యన వాఁడు జంకెను. ఎట్టకేలకు వానిని సమ్మతింపఁ జేసి తనతోఁ బిలచికొని తనమనోరథ మీడేరినందుల కమందానంద మందుచు బహుత్వరితగతిని బయలుదేఱెను.

ఇట్లు విద్యాగురువు, లబ్ధమనోరథుఁడై నిజావాసమునకే తెంచుచున్న సమయమున, నామూఢశిఖామణికి మహారాజ సభాయోగ్యము లగు కొన్నిమాటల నెట్లో నేర్పి వానిచే వల్లింపఁ జేయుచు వచ్చెను. ఎంత వల్లింపఁ జేసిన నేమి ఫలము? వాని గాడిదల మహిమయు, వాని నీచపుమాటలును, మధ్యమధ్యను వచ్చి, వానిని ముంచుచుండెను. అప్పుడా బ్రాహ్మణుఁడు వానికి గొన్ని యాశీర్వాదవాక్యముల వల్లింపజేసెను. రాజపుత్రిక నమస్కారము నేయునపుడు చదువవలసి

నధిగ చెప్పించెను. కాని వెనువెంటనే వాడు మఱచుచుండెను,
ఆవృద్ధబ్రాహ్మణునియెడగల భయముచేత దాని నణఁచుకొను
చుండెను. ఇటు లిరువురును రాజ్యమును జేరి యా నూతనవరు
నకు నొకవిడిది యిల్లేర్పాటుజేయించి, యందు వానిని విశ్ర
మింపఁజేసి యారాత్రి యచ్చోటనే గడపెను. వరుని జూచి యా
నందింప నేగుదెంచెనో యన్నట్లు సూర్యభగవానుఁడు దూర్పున
నుదయించెను. గుర్వాజ్ఞప్రకారము ఆ నూతనవరుఁడు కాల్య
కృత్యములఁ దీర్చికొని యొకచోఁ గూరుచుండెను. పట్టణ
ములోగల యున్నతరాజకీయోద్యోగులును రాజబంధువులును
వరుని జూచుటకై యేతెంచిరి.

రాజగురు వగు నాబ్రాహ్మణుఁడును కాల్యకృత్యములం
దీర్చికొని, రాజదర్శనమునకై రాజభవనమునకుఁ జనుదెం
చెను. రాజును గురునిరాక కెదురుచూచుచు, గూర్చుండి
యుండెను. పండితుఁడు రాజు నాశీర్వదించి "ఓ రాజవరేణ్యా!
మన మిన్నిదినములు వరాన్వేషణకై పడినశ్రమ మంతయు
నేటికి సఫల మైనది. నీ యొక్కయు, చంపకకలిక యొక్కయు,
పూర్వపుణ్యమువలన నసమానుఁ డగువరుఁడు లభించినాఁడు.
మీవంశ మతిపావన మైనది. ఈకన్యాదానముచే మీరును
మీపూర్వులును కృతార్థు లగుదురు. నీకొమరితకు లభించిన
వరుఁడు భూలోకసరస్వతియే యనఁదగును. నానాదేశములు తిరిగి
మెచ్చుటను దగినవరునిఁ గానక, చింతాక్రాంతుఁడనై యుండి

ఒకనాఁడు నేను స్వప్నముఁగని యితనిని సంపాదించితిని. గౌడ దేశమున నితనిని 'భూలోకబృహస్పతి' యనియే పిలుతురు. మహాశూరుఁడును, విద్వాంసుఁడునగుటచే మీకులము పవిత్ర మైనది. ఇతనికిఁ దెలియనివిద్య లేవియును లేవు. రూప మునను కూడ నసమానుఁడే! ఉత్తమవంశసంభూతుఁడు. మఱియును సకలవిషయములందును నీపుత్రికకు ఈతఁడు తగిన వరుఁడు. నానిర్బంధమున నిన్నుఁ గృతార్థుఁ జేయ నిట కేతెంచిన మహాత్ముఁడు."

ఈవాక్యములు రాజునకు అమితానందమును గలిగించి నవి. రాజును సపరివారుఁడై వరుని దర్శింపనేగెను. పొట్టలో నేమూలను నొకయక్షరమైనను లేకున్నను, రూపమున నతఁడు మిక్కిలి సుందరుఁడుగాఁ గానఁబడెను. అందుచే నాతనియజ్ఞా నము మఱుగువడుచుండెను. మహారాజును గురునివాక్యము లన్నియును యథార్థములే యని నమ్మి, తనబంధువర్గము సమ్మ తినిబడసి, శుభముహూర్తమున వివాహముఁ జేయ నిశ్చయించి, తనప్రజల కావార్తను చాటించెను; కాని యంతవఱకు ఆమూఢవరుని మౌనము దాల్చునట్లుచేయుట గురున కధిక ప్రయాస మయ్యెను.

ఎట్టకేలకు వివాహశుభముహూర్తము నిశ్చిత మయ్యెను. మహారాజతివైభవముగ సకలసామంతరాజులు పరివేష్టించి యుండ, దశదిశల మంగళతూర్యనాదముల ప్రతిధ్వనులు చెల

ర్రేఁగ, శుభముహూర్తమున వివాహము జరిపించెను. ఆనూతనదంపతులు నవయౌవనమున నుంటచే, వెంటనే కులాచారప్రకారము పునస్సంధానమునుకూడ సేయించెను. రాజకుమార్తె యొక్క సఖీజనబృందము ఆనూత్నదంపతులక్రీడాగృహమును జక్కఁగ నలంకరించి, హంస తూలికాతల్పమును పుష్పములచేతను రత్నాదులగు మణులచేతను, బహుభంగుల శృంగారించి చీనిచీనాంబరములఁ బఱచి యందు శయనించువారి కెఱుక లేకయే నిద్రాదేవి యావేశించు నంతటి రమణీయముగను, మనోహరముగను, శయనాగారమును అలంకరించి సిద్ధము చేసిరి. ముహూర్తకాలము సమీపింపఁగానే, పురోహితుఁడు క్రియాకలాపము నారంభించి క్రమముగా ముగించెను. పిమ్మట యానూత్నవరుని శయనగృహమునఁ బ్రవేశింపఁజేసిరి. స్వభావముచేత నితఁ డేమియు నెఱుఁగనివాఁ డగుటచేతను, తన యాయుఃకాలమున నిట్టి శయనగృహమును జూడనివాఁ డగుటచేతను, లోనఁబ్రవేశించి యటునిటుఁ జూచి, శయ్యపైఁ బరుండెను. నేలపైఁ బొర్లాడువాఁ డగుటచే నింతటిమెత్తందనము శరీరమునకు దగులుటచే నతఁడు పరుండిన వెన్వెంటనే మైమఱచి గుఱక వెట్టి నిద్రింపమొదలిడెను. సఖీజనమును రాజపుత్రికను మెల్లమెల్లఁగా శయనాగారమునఁ జేర్చి, బుజ్జగించి తలుపులు వైచికొని వెడలిపోయిరి. జగన్మోహనాంగి యగునా రాజపుత్రిక లోనఁ బ్రవేశించి, నిదురపోవుచున్న నిజేశ్వరుని

సౌందర్యమును తదేకదృష్టితోఁ జూచుచు నిలువఁబడెను. కాని యాపరుఁడు బ్రహ్మానందముగ పెద్దమ్మకు వశుఁడై యుండెను. అది గని మహాభర్తక్రియా కలాపనిర్వాహణములచే నాయాసము నంది, గాఢనిద్రలో నున్నాఁడని తలఁచి, మెల్లఁగ నట నది వఱకే దాసిచే నుంపఁబడిన వీణను చేతఁబుచ్చుకొని వాయింప మొదలిడెను. గాడిదకూఁతలకును కుక్కలమొఱుగులకు సైతము లేవనియతఁడు యావీణానాదమునకు లేచునా? రాజపుత్రి కొంతసేపు చూచి, మధురమగుగాత్రమునఁ బాడఁదొడఁగెను. అప్పటికిని అతఁడు కదలఁడాయెను. తదుపరి పరిమళద్రవ్యముల జల్లి వీవనతో వీవఁదొడగెను; కాని వ్యర్థమయ్యెను. ఇంతచేసియు మెలకువ రామికి సందేహించి, తూలికపైఁ గూరుచుండి, తములమును పతినోటనుంపఁగా బెదరి లేచి, "గాడిదగత్తర" యని యఱచి నిదురించెను. ఆమె భర్తవచనములకు సందేహించి, యోచనాసముద్రమున మునిఁగెను. కొంతసేపటికి అతఁడు బుస కొట్ట మొదలిడెను. ఆస్థితిఁ గాంచి యామె 'ఏమి యీ యువలక్షణ చర్యలు'? అని యాశ్చర్యపడి, ఇతనిని లేపినఁగాని నిజము నెఱుఁగరాదని తలఁచి ధైర్యము వహించి, మెల్లఁగఁ దట్టి లేపెను. అప్పుడు వాఁడు భయపడి లేచి, యొకమూలకు నొదిగి, "దయ్యము దయ్యము" అని బిగ్గరగ నఱచెను. ఆమాటల కామెయు పనిర్వేదముగ ఱిచ్చవడి, "ఏమిట్లు పలవరించుచున్నాఁడు?" యని యాలోచించుచు చేతనున్న పన్నీరు వానిపైఁ

జల్లెను. దానిచేతను వానికి నిదుర తొలంగ లేదు. ఇట్లు లేవకు న్న యతనిఁజూచి రాజకన్య సందేహింప మొదలిడి, ఏమియో చూతమని నిశ్చయించి, మంచముపైఁ గూరుచుండి వానిపైఁ జేయివైచి, శ్రావ్యగాత్రముతోఁ బాడఁదొడగెను. అదియుబూడి దపాలైనపన్నీ రయ్యెను. ఎట్టకేలకు విసుగెత్తి ధైర్యము వహించి వానిని తట్టి లేపెను. అప్పటికి కొంతకదలిక గలిగి యాతఁడు తటాలున లేచి, కన్నెత్తి చూచి 'దయ్యమేమిట్రో' యని భయపడి మంచమునుండి క్రిందకు దుమికెను. అదిగని రాకొమరిత తనసందేహము బలపడఁగా వానిని సమీపించి, 'వీఁడు మూర్ఖశిరోమణివలె నున్నాఁడు' అని నిశ్చయించు కొనెను.

ఇఁక నామె విచారమునకు మేర యుండునా? చిత్ర ప్రతిమవలె నిశ్చేష్టయై నిలచెను. అపుడంతులేని యాలోచన ము లామెమనసునకుఁ దట్టెను. గురుని యనుమతిని నిరాకరిం చినందుల కివ్విధమున మనఃపూర్వకముగఁ జేసె నని నిశ్చయిం చుకొనెను. ఇట్టిమూర్ఖాగ్రేసరుని దనకు పతిగఁజేయ నాభగ వంతుఁడును సమ్మతించె గదా యని నిందించుకొనెను. 'వీఁడు గాడిదలఁ గాయువాఁ' డని యితనిప్రలాపముచేతనే విదిత మగుచున్నది. సకలకలాభ్యాసమును బొంది, మంచివిద్వాంసుని, గుణవంతుని, బడయఁగోరిననాకు, దరిద్రుఁడును మూర్ఖుఁడును అనాగరకుఁడునునై గాడిదలఁగాయువాఁడా పతి యయ్యెను? ఏమిచేయుదును అయ్యోతల్లీ! ఇది నీవువిన్నచో బ్రతికి

యుందువా? తండ్రి నీ వైనను పరీక్షింపక పోయితివా? దీనిని దెలిసినచో నెంతగఁ గుందుదువో గదా! సర్వలక్షణసమన్వితులను, సకలవిద్యాపారంగతులను విడిచి, ఛివఱకు ఒకగాడిదలగాయువానినా యీాచంపకకలిక వరించినది? ఎంతటిదురదృష్టము! నే నెంతటియాసతో నుంటినో, యెంతటి నిరాశ నొందితిని. నాజీవితమంతయు వృథ యయ్యెను. ఇఁక నేమి సేయుదును? నాపూర్వపుణ్య మింతియే; కాని యితని రూపలావణ్యములఁ జూచిన గొప్పవంశమునకుఁ జెందినవాఁ డైనట్లు కనఁబడుచున్నాఁడు. మాటలఁజూచిన ననాగరకుఁడని తెలియుచున్నది ఇతఁ డేకారణముననో ఎఱుకలతో కలసియుండవచ్చును. కావున గాడిదలకావలి కాఁడు. ఇట్లు పలుభంగుల చింతించి వీఁడెవ్వఁడో వీనికులగోత్రము లెవ్వియో కనుగొనెదము గాక" యని వాని నుద్దేశించి యిట్టు లనెను.

చంపక:—ఓప్రాణవల్లభా! మీాతలిదండ్రు లెవరు? మీాదేశమెయ్యది? కుల మేది? మీానామమేమియో దయతోఁ దెలుపుదురా?

వరుఁడు:— మాతండ్రి ఎఱుకులగుంపులలో నొకదానికి యజమాని. మాతల్లి యెఱుకులరాణి. మాయూరుగాని పేరుగాని నాకుఁ దెలియదు. మాకులమ్ము ఎఱుకకులము.

చంపక:—మీారు వారికులమునఁ బుట్టినవా రేనా?

వరుఁడు:—ఆ! మఱచితిని. కాదు. కాదు.

ఈరీతి నా రాజకన్య యడిగిన ప్రతిదానికిని తెలిసిన ట్లొకమాఱును, తెలియనట్లొకమాఱును, తడఁబడుచు వెఱ్ఱి చూపులతోఁ దత్తఱపడుచుఁ బ్రత్యుత్తర మిచ్చుటఁ జూచి,కోప గించి యా రాజకన్యక కత్తిఁ జేతఁబట్టి జళిపించుచు, నిజముఁ దెలిసికొనఁ బ్రయత్నించి, వానిని బెదరించెను. ఆ కత్తిని జూచు టతోడనే వాఁడును భయభ్రాంతుఁడై నెఱగొంది 'తల్లీ! నే నేమియు నెఱుంగను. నీ వేమి జేయ మన్నఁ జేతు. చంపకు చం పకు' అనిదండ మిడెను. అది గని రాజపుత్రి వానిభయమునకు జాలిపడి కొంత ధైర్యముఁ గలుగఁజేసి, మఱల నిటులఁ బ్రశ్నించెను:—

నీ వెవఁడవు? నీ కేదైన విద్య తెలియునా? నిన్నిటకు దెచ్చిన దెవరో తెలుపుము.

వరుడు:—ఓసీ! ఆముసలి బాపఁడు నన్ను తీసుకవచ్చాడు. అపుడు నాకు రాచకూతును పెండ్లి జేస్తానని చెప్పి, పెండ్లి అయ్యేవఱకు మాటలాడ వద్దని చెప్పాడు. అంతే నాకు దెలిసింది. నాకు విద్దె రాదు. గాడిదెలమేపడం నాకు తెలుసు. నేనెవడనో నాకే తెలియదు. నన్ను వదలి వేస్తివా! నీకు పుణ్యమగును.

అని యేడ్చుచుఁ బలికెను. అది విని రా కుమారి వీఁడమా యికుఁడని గ్రహించి తనగురువుచేసిన మోసమునకు వగచి

గతమునకు చింతించి పనిలేదని ధైర్యము వహించి, వీనిని విద్యావంతునిగఁ జేయుటకు దగినమార్గము నాలోచించి ఆది నుండి చదువుట యసాధ్యమే గాని యటులుగాక దేవతావర ప్రసాదమున మిగుల త్వరగ విద్యావంతుఁడు కాగలఁడని, లేకున్న ఫలము లేదని తలఁచి, వానితో నిటు లనెను. 'ఓసుందరుఁడా! నీకు విద్య కావలయునా?' అన నాతఁడు విద్యాప్రభావ మెఱుఁగని మూర్ఖుఁడగుటచేఁ దన కక్కఱ లేదనెను. అపుడు సూక్ష్మబుద్ధి గలయారాజకన్యక వానికి మంచి మాటలు జెప్పి విద్యాప్రభావము నెఱిఁగించి, విద్య నేర్చుకొనుట ముఖ్యమని వాని నొడఁబఱచెను. సజ్జనసంసర్గముచేతనే గదా సద్బుద్ధులు గలుగును. అంత,వాఁడు విద్యకై పరితపింప మొదలిడెను. వెంటనే రాజపుత్రియు సంతసించి, యాకిరాతభర్తతో నిటు లనెను. "నాథా! ఈపురమునకు సంరక్షకురాలును, మాకుఁ గులదేవతయు నగుకాళికాదేవి యాలయ మిటకుఁ గొంతదూరమున నున్నది. దాని ప్రాకారములో నొకయాశ్రమము గలదు. అందు బ్రహ్మానందయతి యనుమహాత్ముఁడు గలఁడు. మొదటినుండియు జదువుటసాధ్యము కానిపని. వరప్రసాదమున సకలవిద్యలను సులభముగ నేర్వవచ్చును; కాన మీరట కిప్పుడే పోయి,ఆయతీశ్వరునికి నమస్కరించి, విద్య కావలయు నని కోరుఁడు. ఆయన మహాకాళీమంత్ర ముపదేశించి యుపాసనక్రమమును దెలుపును. ఆప్రకార ముపాసించినచో మీకు కాళి ప్రత్యక్ష మగును.

ఆమహాదేవి ప్రత్యక్షమై, యేమి కావలయు నని యడుగును. విద్య కావలయు నని కోరుఁడు. వెంటనే వరప్రదానము నామె నీకుఁజేయును. అంతటితో నామహాదేవికి నమస్కరించి, యిటకు మరలిరండు. ఏవిషయమునను కొఱంతయనునది లేక సుఖముగ శాస్త్రిచర్చలు చేయుచు, కాలము గడపవచ్చును'' అని బోధించి కాళీదేవాలయమునకు మార్గమును చూపి ప్రయాణముఁ జేయించెను.

అది శుక్లపక్ష మగుటచేఁ జంద్రుని కాంతిని సహాయముగఁ గొని రాజపుత్రిక చెప్పిన గుఱుతులను కనిపెట్టుచు, అర్ధరాత్రమునకు గాళీదేవాలయమును జేరి, యాశ్రమమును గనుగొని యతిని, సమీపించి చూచునప్పటికి, ఆయన నిమీలితనేత్రుఁడై పద్మాసనాసీనుఁడై యుండి, యోగమునవలంబించి యుండెను. సాంజలియై నిలబడినమూర్ఖశిఖామణి యగువానూతనవరుఁ డెంతసేపటికిని యతి కండ్లుదెఱవక యుండుటఁ జూచి, యటనె నిలువఁబడెను. ఇంతలో నిశియగుటచే నాయతిపుంగవుఁడు నిష్ఠనుండి లేవ నిశ్చయించి, కండ్లుదెఱవ, నెదురుగా నిలుపఁబడియున్న సుందరపురుషుఁడు అతిత్వరితముగ సాష్టాంగనమస్కార మాచరించి బద్ధాంజలియై యుండెను. యతియు నంతటియర్ధరాత్రమున నట కొంటరిగ నేగుదెంచిన యాసుందరపురుషుఁడెవఁడో యని యాశ్చర్య మంది, వానిఁ జూచి యిట్లు ప్రశ్నిం

చెను. "ఓరీబాలుఁడా! నీ వెవఁడవు? ఇట కెందుల కిప్పుడు వచ్చితివి? నాతో నేమైన పని యున్నదా? అన్నియు వివర ముగఁ జెప్పు" మనె. వాఁడును తనసతి బోధించినవిధమునన్ని యు నాయతీశ్వరునికి విన్నవించి, "నాకు విద్య కావలయు, నద్దా నికి మీరే నాకు గురువులుగ నుండవలయును" అని ప్రార్థించెను. అది విని యాయన వానిమూర్ఖత్వమునకు జాలినొంది యపుడే వానినచ్చట గల సరోవరమున 'స్నాన మాచరించి శుచివై రమ్మ'ని యంపెను. వాఁడును యతీశ్వరుని యాజ్ఞప్రకారము స్నానముచేసి శుచి యై వచ్చెను. అపుడు యతిపుంగవుఁడు వానికి మహాకాళీమంత్రము నుపదేశించి దానిని జపించు విధమునుజెప్పి, యాయన వెడలిపోయెను.

అనంతరము, ఆబాలుఁడు యతియుపదేశప్రకారము క్రమముఁదప్పక యాకాళీమంత్రమును జపింప మొదలిడెను. మూర్ఖుఁడును మోటుమానిసియు నగుటచే గుర్వాజ్ఞను జవదా టక మూఢభక్తితోఁ దదేకధ్యానముతో జపించుచుండెను. ఇంతలో మూర్ఖావతంసుఁడగునీకిరాతునిముఖదర్శనము చేయ గూడదనియెంచెనో యనునటుల కారుమబ్బులనడుమన దాఁగి దాఁగి, యెట్టకేలకు ధైర్యము వహించి, సూర్యుఁడు ఉదయగిరి నుండి యాకాశవీథిని బడెను. అంతకుఁ బూర్వమే స్నానసం ధ్యాదికృత్యములఁ దీర్చి సరస్సునుండి యతీశ్వరుఁడు ఆశ్రమ మును జేరి కిరాతుని మూఢభక్తికి మెచ్చి, వానిని స్నా

నముఁ జేసి ర మ్మని, వాని కుపనయనాదికర్మలఁ జేసి బ్రహ్మో పదేశముఁజేసి, బీజాక్షరముల జపము జేయ నుపదేశించి, తన కార్యమునఁ దానుండెను.

వీర లిటులుండ, రాజసౌధమునఁ గలరాజకన్యక రాత్రి పోయినతనపతిస్థితి యెటు లున్నదో కనుఁగొనవలయు నని నిశ్చ యించి తనసఖీజనముతో దేవీదర్శనమిషచే దేవాలయమున కరుదెంచెను. దేవీదర్శనము జేసికొనినపిదప, తనభర్త యేమి చేయుచున్నాఁడో చూడవలయునని యాశ్రమమునకు వచ్చెను. ఒకమూల తనభర్త ఘోరతప మాచరించుటఁగని, యతఁడు గొప్పవిద్వాంసుఁ డగుట కెట్టిసందియమును లే దని, మనసా నమస్కరించి, యతియాశీర్వచనమును బడసి వెడలుసందర్భ మున నొకశ్లోకము నీక్రిందివిధముగ నాశువుగఁ జెప్పెను.

"అనిల స్యాగమో నాస్తి ద్విపదో నైవ దృశ్యతే,
జలమధ్యే స్థితం పద్మం కంపితం కేన హేతునా"

"ఇపుడు వాయుచలనము లేదు. ఇట పక్షిగాని మను ష్యుఁడు గాని కనఁబడరు. ఇట్టిసమయమున సరోవరములోని పద్మము కంపమొందుటకు హేతు వేమో కదా" యని సాభి ప్రాయముతోఁ బలికి వెడలిపోయెను.

అంతట నాయతిశిష్యుఁడు నిరాహారుఁడై నిశ్చలుఁడై తదేకధ్యానముతోఁ గాళీసన్నిధిని తపస్సు జేయుచునేయుండె ను. ఆదినము సాయంకాలము యతిపుంగవుఁడు వానికి సంధ్యా

వందనాది కర్మల నుపదేశించి యాకృత్యములు ముగిసినవెంట నే వానితో నిటు లనెను. "ఓబాలుఁడా! నీవీదినము రాత్రి నేఁ జెప్పుసమయమునకు దేవాలయముఁ బ్రవేశించి, తలుపులు బి గించుకొనుము. వేకువను నెవ రైన వచ్చి తలుపును దట్టుదురు. తలుపుతీయక జపముఁచేయుచుండుము. అప్పుడు దేవాలయము బైట కోపముతోఁ బలుకుచున్నటులు ధ్వని వినఁబడును. అపు డు భయపడక 'విద్య కావలయును. అట్టివరము నాకిత్తు వేని తలుపును తీయుదును' అనుము. వెంటనే యాబైట నున్నకా ళికాదేవి యట్లే కానిమ్మని వర మిచ్చును. అంతట తలుపు దెఱ చి యాదేవిని స్తుతింపుము" అనవిని దేవాలయప్రవేశసమయ ము నెదురుచూచుచుండెను. ఇంతలో నాసమయ మగుటచే యతీశ్వరుఁడు వానిని బిలిచి, దేవాలయముఁ బ్రవేశింపు మని యానతిచ్చి లోనఁ జేయవలసినకార్యమును మఱొకసారి బో ధించెను. అంత నామూఢశిఖామణియును కాళికాలయమును బ్రవేశించి, తలవుల బిగించి జపము సేయ మొదలిడెను.

ప్రతిపట్టణమునకును, ప్రతిపల్లెకును రక్షణకర్త్రిగ నొక పరాశక్తి యుండును. అటులే యీపట్టణమునకు కాళీదేవి రక్షణకర్త్రి. రాత్రి రెండవజాము మొదలు నాల్గవ జామువఱకు నూరంతయు నామె సంచరించుచు, తనప్రజలఁ గాపాడుచుండుట వాడుక. ఇతరదేవతలను తనరాజ్యమునఁ బ్ర వేశింపనీయకుండునట్లును, తనప్రజలఁ బీడింపకుండునట్లును గాపా

డుటయియాశక్తుల విధి. అటులే యీకాళీదేవియు నాపట్టణమును గాచుచున్నది. నూతనవరుఁడు దేవాలయప్రవేశమునకు పూర్వమే, మహాదేవి తనవిధిని నెఱవేర్చుటకై వెడలిపోయెను. జపము జేయుచుఁగూర్చున్నవాఁడు కొంచెమేనియు చలింపక ఘోరతప మాచరించుచుండెను. క్రమముగ మూఁడుజాములు గడచి నాలుగవజాము ప్రవేశించెను. ఇంతలో నెవరో భీకరకంఠముతోఁ గోపమున "ఎవ రా లోపల" నని హుంకరించుధ్వని వినఁబడెను. ఆమాటలు వానిచెవి కెక్కలేదు. కొంతసే పుండి మఱలఁ బెద్దగ నఱచుచు తలుపు దన్నెను. అప్పటికిని వాఁడెఱుగఁ డాయెను. ఇంతలో నుదయమును కాఁజొచ్చెను. దేవి త్వరపడుట గని నిర్భీతుఁడై వాఁడును కదలకుండెను. ఇంతలో లోపలినుండి "విద్య కావలెను విద్య కావలెను" అనునొకధ్వని మహాదేవికి వినఁబడెను. వెంటనే మహాదేవి దివ్యదృష్టిచే నెల్లసంగతుల గ్రహించి, వానిమూఢత్వమునకు జాలినొంది, "ఓరీ! తలుపుఁదీయుము. నీకు వర మిచ్చెదను" అనెను. అదివిని మఱల "విద్యకావలయు" నని పలికెను.

అదిచూచి కాళికాదేవి కోపమువహించి ఉదయ మగుచుండుటచే భయంపడినదై వానికి లొంగెను. ఏమి చేయుటకును దోఁపక వానిని నాలుకను తలుపుసందున చాపు మని పలికి, యేవో కొన్ని బీజాక్షరముల వానినాలుకయందు వ్రాసెను. అపుడు వానిదశాపరిణామ మే మని చెప్పఁగలము? ఇంత

వట్టి కాళిదాసుఁడు మూర్ఖుఁడును మోటువాఁడును, అనాగరకుఁడును నైయుండెను. ఇపుడో వాఁడు మహాపండితుఁడును నాగరకుఁడును మహాకవియు నయ్యెను. ఇదివేఱుజన్మమే యనవలయు. వెంటనే వాఁడు కలగనిలేచువానివలె లేచి తలుపుఁదీసి దేవికి సాష్టాంగప్రణామ మాచరించి యీక్రిందనుదహరించిన విధమున స్తుతింపఁగడంగెను. అది సామాన్యమైన స్తుతి గాదు. అట్టికవితఁ జెప్పుటకు భారతీదేవికిని సాధ్యము గాదు. గంగానదీప్రవాహముబోలె నిరాఘాటముగ కవితాప్రవాహము ప్రవహింపఁజొచ్చెను.

---

## శ్రీ శ్యామలా దండకము.

---

శ్లో. మాణిక్యవీణా ముపలాలయంతీం
మదాలసాం మంజులవాగ్విలాసాం
మాహేంద్రనీలద్యుతి కోమలాంగీం
మాతంగకన్యాం మనసా స్మరామి.

శ్లో. చతుర్భుజే చంద్రకళావతంసే
కుచోన్నతే కుంకుమ రాగశోణే
పుండ్రేక్షు పాశాంకుశపుష్పబాణ
హస్తే నమస్తే జగదేకమాతః.

శ్లో. మాతా మరకత శ్యామా
మాతంగీ మదశాలినీ
కుర్యాత్కటాక్షం కల్యాణీ
కదంబవనవాసినీ

శ్లో. జయ మాతంగతనయే
జయ నీలోత్పలద్యుతే
జయ సంగీతరసికే
జయ లీలాశుకప్రియే.

జయ జనని సుధాసముద్రాంత హృద్యన్మణిద్వీప సంరూఢ బిల్వాటవీమధ్య కల్పద్రుమాకల్ప కాదంబ కాంతార వాసప్రియే! కృత్తివాసప్రియే !!

సాదరాలబ్ధ సంగీత సంభావనాసంభ్రమాలోల నీప స్రగాబద్ధ చూళీసనాథత్రికే! సానుమత్పుత్రికే!!

శేఖరీభూత శీతాంశురేఖా మయూఖావళీనద్ధ సుస్నిగ్ధ నీలాలకశ్రేణి శృంగారితే! లోకసంభావితే!!

కామలీలా ధనుస్సన్నిభభ్రూలతా పుష్పసందోహ సందేహకృచ్చారుగోరోచనాపంక కేళీలలామాభిరామే సురామే! రమే!!

ప్రోల్లసద్వాళికామౌక్తికశ్రేణికాచంద్రికా మండలోద్భాసి గండస్థలన్యస్త కస్తూరికాపత్రరేఖా సము

ధ్మ్యాతసారభ్య సంభ్రాంత భృంగాంగనాగీతసాంద్రి భవ న్మంద్రతంత్రీస్వరే! భాస్వరే!!

వల్లకీవాదన ప్రక్రియాలోల తాళీదళాబద్ధతాటం కభూషావిశేషాన్వితే! సిద్ధసన్మానితే!!

దివ్యహాలా మదోద్వేల హేలా లసచ్చక్షు రాందోళ నశ్రీసమాక్షి ప్తకర్ణైకనీలోత్పలే! శ్యామలే!!

పూరితాశేషలోకాభివాంఛాఫలే! నిర్మలే!!

స్వేదబిందూల్లస త్ఫాలలావణ్యనిష్యందసందోహ సందేహకృన్నాసికామౌక్తికే! సర్వమంత్రాత్మికే!!

కుందమందస్మితోదారవక్త్రస్ఫురత్పూగ కర్పూర తాంబూల ఖండోత్కరే! శ్రీకరే!!

కుందపుష్పద్యుతిస్నిగ్ధదంతావళీ నిర్మలాలోల క ల్లోల సమ్మేళనస్మేరశోణాధరే! చారువీణాధరే!! పక్వబిం బాధరే!!

సులలితనవయౌవనారంభ చంద్రోదయోద్వేల లావణ్యదుగ్ధార్ణవావిర్భవత్కంబుబిబ్బోకహృత్కంధరే! మంథరే!!

బంధురచ్ఛన్నహారాదిభూషాసముద్యోతమానాఽ నవద్యాంగశోభే! శుభే!!

రత్నకేయూర రశ్మిచ్ఛటాపల్లవప్రోల్లస ద్దోర్లతా రాజితే! యోగిభిః పూజితే!!

విశ్వదిఙ్మండలవ్యాపి మాణిక్యతేజః స్ఫురత్కంకణా
లంకృతే ! సాధుభి స్సత్కృతే!!

సంగరారంభ వేళా సముజ్జృంభమాణారవింద ప్రతి
చ్ఛందపాణిద్వయే ! సంతతోద్యద్దయే!!

దివ్యరత్నోర్మికాదీధితిస్తోమసంధ్యాయమానాంగుళీ
పల్లవోద్యన్నఖేందు ప్రభామండలే! ప్రోల్లసత్కుండలే!!

తారకారాజనీకాశహారావళి స్మేరచారు స్తనాభోగ
భారానమన్మధ్యవల్లీ వళిచ్ఛేదవీచీసముద్యత్సముల్లాస
సందర్శితాకారసౌందర్య రత్నాకరే ! శ్రీకరే!!

హేమకుంభోపమోత్తుంగ వక్షోజ భారావనమ్రే !
త్రిలోకావనమ్రే !!

లసద్వృత్త గంభీర నాభీసరిత్తీర శైవాలశంకాకర
శ్యామరోమావళీభూషణే! మంజుసంభాషణే!!

చారుశింజత్కటీసూత్ర నిర్భర్త్సితానంగలీలాధను
శ్శింజినీడంబరే! దివ్యరత్నాంబరే!!

పద్మరాగోల్లసన్మేఖలాభాస్వరశ్రోణిశోభాజితస్వర్ణ
భూభృత్తలే! చంద్రికాశీతలే !!

వికసితనవకింశుకాతామ్రదివ్యాంశుకచ్ఛన్న చారూ
రుశోభాపరాభూత సింధూరశోణాయమానేంద్రమా
తంగహస్తార్గళే! శ్యామలే !!

కోమలస్నిగ్ధ నీలోత్పలోత్పాదితానంగతూణీరశం కాకరోద్దామజంఘాలతే ! చారులీలాగతే!!

నమ్రదిక్పాలసీమంతినీకుంతలస్నిగ్ధనీల ప్రభా పుంజ సంజాత దూర్వాంకురాశంకసారంగ సంయోగరింఖ న్నఖేందూజ్జ్వలే! ప్రోజ్జ్వలే !!

దేవదేవేశ దైత్యేశయక్షేశభూతేశ వాగీశ కోణేశ వాయ్వగ్ని కోటీరమాణిక్య సంఘృష్టబాలాతపోద్దా మలాక్షారసారుణ్యలక్ష్మీగృహీతాంఘ్రిపద్మద్వయే ! అద్వయే!!

సురుచిర నవరత్నపీఠస్థితే! సుస్థితే!!

శంఖపద్మద్వయోపాశ్రితే! ఆశ్రితే !!

దేవి దుర్గావటుక్షేత్ర పాలైర్యుతే! మత్తమాతంగ కన్యాసమూహాన్వితే !!

భైరవైరష్టభి ర్వేష్టితే! దేవి వామాదిభిస్సంశ్రితే!!

లక్ష్మ్యాదిశక్త్యష్టకాసేవితే! భైరవీసంవృతే!!

పంచబాణేన రత్యాచ సంభావితే ప్రీతిశక్త్యా వసంతే! సదానందితే!!

భక్తిభాజాం పరంశ్రేయసే కల్పసే! ఛందసామోజసే భ్రాజసే ! యోగినాం మానసే ధ్యాయసే ! గీతవిద్యాదియోగాతితృష్ణేన కృష్ణేన సంపూజ్యసే!

భక్తిమచ్చేతసా స్తూయసే! విశ్వహృద్యేన నాద్యేన విద్యాధరైర్గీయసే!!

యక్షగంధర్వ సిద్ధాంగనామండలై ర్మండితే! సర్వసౌభాగ్యవాంఛావతీభి ర్వధూభి స్సురాణాం సమారాధ్యసే !

సర్వవిద్యావిశేషాన్వితం చాటుగాథాసముచ్చారణం! కంఠమూలోల్లసద్వర్ణరేఖాన్వితం! కోమలం శ్యామలోదార పక్షద్వయం! తుండశోభాతిదూరీభవత్కింశుకం లాలయంతీ పరిక్రీడసే !

పాణిపద్మద్వయేనాపరేణాక్షమాలాగుణం స్ఫాటికం జ్ఞానసారాత్మకం పుస్తకం బిభ్రతీ యేన సంచింత్యసే!

చేతసా తస్య వక్త్రాంతరా ద్గద్యపద్యాత్మికా భారతీ నిస్సరేత్ యేనవా యావనాభాకృతి ర్భావ్యతే ! సోపి లక్ష్మీసహస్రైః పరిక్రీడతే!

కిన్నసిద్ధ్యేద్వపు శ్శ్యామలంకోమలం తావకం చంద్రచూడాన్వితం ధ్యాయత స్తస్యలీలాసరోవారిధిః తస్యకేళీవనం నందనం - తస్యభద్రాసనం భూతలమ్.

తస్యగీ ర్దేవతాకింకరీ-తస్యచాజ్ఞాకరీ శ్రీ స్స్వయం- సర్వయంత్రాత్మికే-సర్వతంత్రాత్మికే-సర్వశక్త్యాత్మికే- సర్వముద్రాత్మికే - సర్వచక్రాత్మికే - సర్వసర్గాత్మికే.

సర్వరూపే - జగన్మాతృకే - హేజగన్మాతృకే- హేజగ
న్మాతృకే! పాహి మాం, పాహి మాం, పాహి.

---

ఇట్లు స్తుతించి యామహాదేవిని సంతోషింపఁజేసి, ఎపు డుదలఁచిన నపుడు ప్రత్యక్షమగునట్లు వాగ్దానము దీసికొని యత్యాశ్రమమును జేరి, స్నానాద్యనుష్ఠానములఁ దీర్చికొని,యతికి నమస్కరించి, తా సంపాదించిన వరమును దెలిపి, తనకబ్బిన కవితాసామర్థ్యమును దెలియఁజేసి, వారియొద్ద కాళిదాసను నామము గ్రహించి, యాశీర్వచనము బొంది, యట నుండి సెలవుగైకొని బయలుదేఱెను. అంతలో భర్తనఁజూడ కుతూహలముతో నేగుదెంచిన రాజకన్యకను జూచి ముందటి దినము రాజకుమారిచే నడుగబడిన శ్లోకమును జ్ఞాపకమునకు దెచ్చుకొని దాని క్రిందివిధముగఁ బ్రత్యుత్తరము నిచ్చెను.

"పావకోచ్ఛిష్టవర్ణస్య శర్వర్యా బంధనం కృతం,
మోక్షం న లభతే కాంతే! కంపితం తేన హేతునా"

"రాత్రి ధూమమువంటి కాంతిగలదాని (అనఁగాఁ దుమ్మెదను) కారాగృహమున బంధించినది. ఇంకను విడిపింపలేదు, కావుననే కదలుచున్నది" దీనిని విని రాజపుత్రి అత్యాశ్చర్య భరితయై నేనడిగినప్రశ్నకు సరియైన సమాధాన మిచ్చెను గదా! ఎంతటిపుణ్యశాలియో కదా! ఇంతశీఘ్రముననే యింతటి పాండిత్యము గలిగి కవితాశక్తియు కలిగినది. ఇఁక నానోము

ఫలించినది. నాయంతటి భాగ్యశాలి లేక నుండఁబోదు. ఇటు లనేకరీతులఁ దన్నుఁ బొగడికొనుచు భర్తనుసమీపించి, వానికి నమస్కరించి త న్ననుగ్రహింప వేడుచు నిటు లనెను. 'నాథా! మీయెడ నేఁజేసిన యకృత్యముల క్షమింప వేఁడుదానను. నన్నుఁ గృతార్థురాలిని జేయ ననుగ్రహించినకాళికాదేవికి నావందన శతంబులు. ఇఁక న న్ననుగ్రహించి యేలుఁడు. ఈదాసిని తమ పరిచర్యకై నియమింపుడు" అని యారాజకన్యక సాభిప్రాయ ముగఁ బలికెను. అదివిని కాళిదాసు "ఓరాజపుత్రీ! నీవు నా కపచారము చేసితి నంటివి. అది యపచారము కాకపోవుట య గాక, నాకు అమూల్యోపకార మైనది. ఆఋణమును దీ ర్చుకొనుట కెన్నిజన్మము లెత్తి నిన్ను సేవించినను తీఱదు. జ్ఞానశూన్యుఁడును, నీచకులసంసర్గముగలవాఁడును, అనాగర కుఁడును నైనయొకనికి జ్ఞానోపదేశముఁ జేసి, వానిమూఢత్వ మును బాఱఁద్రోలతివి. అది అపచార మగునా? నీవలననే కదా యతీశ్వరుని దర్శనమును, కాళీదేవి ప్రసన్నత్వమును గలిగినవి. నిన్నెటులు గొనియాడుటయో నే నెఱుగఁజాల కున్నాను. నీవు నాకు పూజ్యురాలవైతివి. నాలుగుదినములక్రితము మన కేర్ప డిన భార్యాభర్తృసంబంధము నేటికి గురుశిష్యసంబంధముగఁ బరిణమించినది. న న్ననుగ్రహింపుము. ఈశిష్యునకు గురు శుశ్రూష నాజ్ఞాపింపుము. నీ కిదే నమస్కారము" అని ఆరాజ పుత్రికిఁ బ్రదక్షిణనమస్కారము లొనరించెను.

కాళిదాసుని చేష్టితములఁ జూచి రాజపుత్రి ఆశాభంగ ముఁ జెందినది. రూపవంతుఁడును, విద్యావంతుఁడును నైన కాళీదాసునితో సుఖముగఁ గాలముఁ గడపఁదలచినరాజకన్య కకు మితిలేనిచింత కలిగెను. ఇఁకఁ గాళిదాసుని మార్పు లెటు లు? తనయనురాగము ననేకరీతులఁ బ్రకటించెను కాని యాతఁ డందుల కియ్యకొనలేదు. "తా నొకటి తలఁచిన దైవము మఱొ కటి తలఁచె" నన్నటు లైనది.

"ఓమహాత్మా! మీ రిటకువచ్చుటకు నాగురువు కార ణము. మొన్నటిదినము మిమ్ములఁ జూచినప్పటినుండియు నా గురువుచేసిన యపకృతికి నేఁగుందుచుంటిని. కాళికాదేవి వలన మీరు విద్వాంసు లైతిరి. నే నెంతయో సంతోషించి మి మ్ముఁగూడి సుఖింపఁదలఁచితిని; కాని మీరు న న్ననుగ్రహింప సమ్మతింపకున్నారు. ఇది మీకు ధర్మము కాదు. అగ్నిసాక్షిగఁ బరిణయమైన స్త్రీని విడిచి వేఱువిధముగ భావించుట మానవధర్మము కాదు. కాన మీ రన్యభావమును వీడి నన్ను పతిగ్రహింపుఁడు" అని యనేకవిధములఁ బ్రార్థించెను కాని ఆ కాళిదాసు అచంచలముగుపట్టు పట్టెను. చంపకకలిక యాడిన జా లిమాటలకు ఆతనిమనసు కఱఁగలేదు. ఆతఁడు మఱల గురు భావమునే వ్యక్తీకరించెను. ఇటులు పరస్పరము చాలసేపు వా దులాడి, చంపకకలిక విసిగి కుపిత యై, నేత్రాంబుకణములు ప్రవహింప, శరీరము గడగడ వడఁక "ఈనాస్త్రీజన్మమును నీ

పు వ్యర్థముఁ జేసివైచితివి; కాన నాయుసురు నీకుఁ దగులక పోదు. నాసౌందర్యమును, నావిద్యను నారాజ్యభోగములను తుదకు నాజన్మమును వ్యర్థముచేసితివి గాన నీవు నీచస్త్రీచే మరణ మందెదవుగాక! ఇఁక వివాహము లేకయేయుందువుగాక" యని అత్యుగ్రయై శపించెను. కాళిదా సామెశాపమునకు భయంపడక, అకంపితుఁడై యటనుండి వెడలిపోయెను. చంపక కలికయు భోరున నేడ్చుచుఁ దనయంతఃపురముఁ జేరి బ్రహ్మ చర్యదీక్షఁ గైకొని, తన జన్మాంతరకర్మమునకు వగచుచు, వేదాం తవిద్యాచింతనము సేయుచుఁ గాలము గడపుచుండె.

---

# శృంగార కాళిదాసు

## తృతీయ ప్రకరణము.

### కాళిదాసు శృంగారపురమును జేరుట.

కాళికాలయమునుండి శాపగ్రస్తుఁడై వెడలిన కాళిదాసు మఱికొన్నిదినము లాపట్టణముననే యుండి, పిదప దేశాట నమునకుఁ బయలుదేరెను. ప్రథమమున వంగదేశమును వీడి, గాంధారదేశములోని యొకపటణమును జేరె. ఆనగరమును మదనసేనుఁ డనురాజు పాలించుచుండెను. మదనసేనుఁడు మహాకీర్తివంతుడు. బాహుబలముచే దక్కినరాజుల నందఱను సామంతులనుగఁ జేసికొని, గాంధార దేశమునకు సర్వాధికారి యై, ముఖ్యపట్టణముగ శృంగారపురమను నామముతో నొకపట్టణ మును నిర్మించి, యందుండి రాజ్యము నేలుచుండెను. ఈవి నతడు

రెండవకర్ణుఁడై పండితులకు గల్పవృక్షమై కీర్తిని గడించెను. మదనసేనుఁ డనునామమును సార్థకపఱచుటకు బ్రహ్మ యతనిని సృజించెనోయన నతఁ డసమానసౌందర్యనిధి యై యొప్పుచుండెను. సౌందర్యమునకుఁ దగినగుణములును యతనికి నమరి, తోడిమహారాజులకు శిఖామణి యై యొప్పెను. తనదర్శనార్థమే తెంచుపండితవర్యులను చక్కనిసత్కారముఁ జేసి యంపుచుండువాఁడు. తనయాస్థానమున మహాపండితుల నియమించి, శాస్త్రిచర్చల వీనులవిందుగ వినుచుండెను. ఇట్టిసన్మార్గప్రియునికీర్తి క్రమముగ నెల్లెడలఁ బ్రాఁకెను.

ఇట్టి నిరుపమానకీర్తిచే విలసితుఁ డగు మదనసేనుఁడు కాళిదాసునుగూడ నాకర్షింపఁగలిగెను. ఒకనాటిమధ్యాహ్నమున కాళిదాసు శృంగారపురములోని రాజవీథిని బోవుచు, నొకగృహమును సమీపించి, యందుఁగల బ్రాహ్మణుని దర్శించి, రాజదర్శనముఁ జేయింపఁ బ్రార్థించెను. కాళిదాసునింజూచి, యాబ్రాహ్మణపండితుఁడు మిగుల సంతసించి యిటులనెను:– 'మహాత్మా! మిమ్ములఁజూడ నాకుఁ జాల సంతసమగుచున్నది. తామే దేశస్థులో తెలుప వేఁడుచున్నాను. తాము గొప్పవిద్వాంసులవలె కనఁబడుచున్నారు' అన విని కాళిదాసు తనవృత్తాంతమంతయుఁ జెప్పి, యిటు లనెను. "విద్వద్రాజశిఖామణీ! తా మీరాజాస్థానమునఁ బండితశిరోమణి యని విని రాజదర్శనార్థము తమ్ము యాచింపవచ్చినాఁడను. నన్నాదరింపఁ బ్రార్థించుచున్నాను" అనిన విని, యాపండితుఁడు కాళిదాసు

ను దోడ్కొని రాజసభకు బయలుదేఱెను. సభలోఁ బ్రవేశిం చినవెంటనే కొన్నిపద్యముల నాశీర్వచనపూర్వకముగ నారా జుసన్నిధి నతఁడు చదివెను.

సభలోని పండితు లందఱును, కాళిదాసుకవిత్వమున కును, భావమునకును, పదజాలమునకును నాశ్చర్యముఁ జెంది నిశ్చేష్టు లైరి. మదనసేనుఁడును కాళిదాసుని తదేకదృష్టితో ఱెప్పవాల్పక చూచుచుఁ, బురుషరూపముఁ దాల్చినసరస్వతియే యని సంశయించెను. సభయంతయు నిద్రలో మునిఁగినట్లు నిశ్శబ్దతఁ గాంచెను. కొంతతడవునకు రాజు కాళిదాసున కుచి తాసన మిచ్చి కూర్చుండఁజేసి "ఓపండితోత్తమా! తమపద్య ముల విని చాల నానందించితిని. నేటినుండియు నాసభయందే నిలచియుండుఁడు. తమకు వలసిన వన్నియు నే నొసఁగగలవాఁ డను. నాయాస్థానకవిసార్వభౌములై తాము వెలయుచుండుఁ డు" అని కాళిదాసుని బ్రార్థింపఁగా, సంతోషముతో నాతఁడు ను రాజువాక్యముల కంగీకరించెను. నాటినుండియు మదన సేనుని సభామంటపమున విద్వద్రాజశిఖామణి యై కాళిదాసు విరాజిల్లుచుండెను.

అనంతరము ప్రతిదినమును రాజాస్థానమునకు కాళిదాసు వెడలి, శృంగారశ్లోకములఁ జదువుచు, రాజు నానందపఱచు చుండెను. దానిఫలితముగ కాళిదాసునకు మహారాజు 'శృంగా రకవి' యను బిరుదిచ్చి గౌరవించుచుండెను. కాళిదాసునకును

మహారాజునకును అన్యోన్యగౌరవములు పెరిగి, స్నేహమును వృద్ధియయ్యెను. కాళిదాసు లేనిసభ రాజునకు ప్రీతికరముకా దయ్యెను. శరీరము వేఱైన మన సొకటిగ నిర్వురు నుండిరి. ఇటులుండఁ గాళిదాసునిపట్ల మహారాజువైఖరిని జూచి, తోడి పండితు లసూయాగ్రస్తులై, కాళిదాసు నటనుండి దఱిమినఁగాని తమకు గౌరవ ముండ దని భావించి, సమయమునకై వేచియుండిరి. ఇటులుండ నొకనాఁడు మదనసేనమహారాజు సభామంటపమున నుండ, నొకసేవకుఁ డరుదెంచి 'భోజభూపతి యొద్దనుండి యొకప్రకటనపత్రికను వార్తాహరుఁడు గొనివచ్చి రాజద్వారమున వేచియున్నాఁ' డని విన్నవించెను. అదివిని సకలపండితులచే పరివేష్టితుఁడై యున్నమదనసేనుఁడు ద్వారపాలకునికి భోజభూపతినుండి వచ్చిన వార్తాహరునిఁ బిలచుకొని రమ్మన, యటులనే వానినిఁ దోడ్కొనివచ్చెను. వార్తాహరుఁడు తాఁదెచ్చిన ప్రకటనపత్రికను మదనసేనమహారాజున కందిచ్చి నిలిచెను. ఆపత్రిక నందికొని సమీపమున నున్నపండితాగ్రేసరుఁడగుకాళిదాసున కిచ్చెను. మహాకవి దాని నందుకొని యీవిధముగాఁ జదివెను.

శ్రీమదనసేన మహారాజునకు వందనములు. కుశలోపరి:— మదీయపుత్రి శారదాదేవి సకలకళాకోవిదమై యౌవనదశను పొందినది. వరాన్వేషణముఁ జేయుచుండ నొకరేయి మాకులదేవత యగు భువనేశ్వరి నాకొకయాజ్ఞ

సిడినది. ఆప్రకారముగ వరాన్వేషణ జేయుట నాపి, భువనేశ్వరీయాజ్ఞను నిర్వర్తించితిని. దానిఫలితముగ నీపత్రి కను తమకుఁ బంపితిని. మాశారదాదేవికి సౌందర్యమునను విద్యయందును సమానవరుఁడు దొరకుట కై యిటులు చేసి తిని. నాకొమరితను పొంద నాసక్తిగలవారు సకలకళలయం దునామెను గెలువవలయును. అటులు గెలుచువారలకే శారదను పాణిగ్రహణము చేసియిచ్చెదను. దీని కొక దేవరహస్యము కలదు. దాని నిందు వ్రాయుట యంతయవసరము కాదు కాన విడిచితిని. దానిని యపుడే వెలువడఁజేయుదును. అంతదనుక నేమియు తెలుపలే నందుకు క్షమింప వేఁడువాఁడను.

నమస్కారములు.

—భోజుఁడు.

ఈ పత్రికనుజదివి కాళిదాసు మౌనమునహించెను:—మహారాజు నాపత్రిక కేమియు నర్థము దెలియనివాఁడై యాలో చింప మొదలిడెను. సభలోని పురోహితామాత్యాదిపండిత బృందమును నాపత్రిక కేమియు నర్థము దెలియనివారై మహారాజుతోఁ బాల్గొనిరి. ఇటుల సభామంటపమంతయు నిశ్శబ్దముగ నుండెను. కొంత తడవునకు మహారాజు పండిత బృందమును జూచి "ఓపండిత ప్రకాండులారా! ఈపత్రికలోని విషయము మీరందఱు వింటిరిగదా. దీనియంతరార్థ మేమో

నాకుఁ దెలుపుఁడు. ఈకార్యము మనకుసాధ్యమగునేని ప్రయత్నించిచూచెదము. దీనియందు సఫలుర మైతిమేని రాజసన్మానమునుసత్కీర్తియు గలుగుటయేగాక, మనపుత్రున కా కన్యను వివాహము జేయింపవచ్చును. భోజభూపతియంతటి పుణ్యపురుషుఁడు మనగృహమును ప్రవేశించెనేని మనగృహము పావనమగును. కాన నీపత్రికావృత్తాంతమును నెఱుక జేయుఁడు"అని చెప్పిసభను చాలించెను. పండితులును దీర్ఘాలోచనపరులైయాస్థానమును వీడి; తమనిజమందిరములఁ జేరుకొనిరి. కాళిదాసుఁడును తననివాసమునకు జేరెను.

శృంగార పురాధీశ్వరునకు ఇరువదియేడ్ల సత్పుత్రుఁ డొకఁడుండెను. మదనసేనునకు ఏకైకపుత్రుఁ డగుటచే మిక్కిలి గారాబముగ బెరుగుచుండెను. పితృవాత్సల్యమునకుఁ దగినటుల పండితపుత్రుఁడుగాన సకలశాస్త్రముల నత్యుత్తమముగ నభ్యసించి విద్వన్మణియై యుండెను. ధనుర్విద్యయందు నిరుపమానప్రతిభనుబడసి,పరరాజభయంకరుఁడై యుండెను.వానిశూరత్వమును గ్రహించియేగాబోలు వానికి శూరసేనుఁడని పేరు పెట్టిరి. లావణ్యమున నపరమన్మథుఁడే! ఇట్టి సకల సద్గుణములు నిండిన సత్పుత్రుని గన్నమదనసేనున కేమికొఱంత? సభను చాలించినప్పటినుండియు మదనసేనుని చిత్తమంతయు శారదపైననే లీనమయ్యెను. తనఏకైకపుత్రునకు అట్టివిద్యావతియగు కన్యకామణి దొరకునా యనియాలోచింప మొదలిడెను, కాని

యది దుర్గమమార్గముగ నున్నది. 'శారదను జయించిన వానికే గదా యది లభింప గలదు. మహాసమర్థురాలగుటచేతనే ఇట్టి ప్రకటన గావింపవలసి వచ్చెను. కాని, ఎవఁడోయొకఁడు జయింపవలసియే యుండును. అదిమనకు లభించిన మనయంతటి ధన్యులుమఱి యుండఁబోరు. దేనికిని పండితులు చెప్పెడి హితమును గ్రహింతము' అని పరిపరివిధముల యోచించుచు నాదినమును గడపెను.

మఱునాఁడు యథారీతిని సభాభవనమున నందఱును గూడిరి. పండితులకందఱకును భోజభూపతిపత్రికకు అర్థము తెలుపవలసినది విధియై యుండెను. మదనసేనమహారాజును యథారీతి సభ నలంకరించెను. రాత్రింబవళ్లు మహారాజును యోచనాభిముంచిన పత్రికావిషయము చర్చకువచ్చెను.పండితశ్రేష్ఠుఁడగు గోవిందభట్టు మహారాజు నుద్దేశించి "మహాప్రభూ! మనపండితబృందమునకు ఈశారదను జయించుట బహుసులభకార్యము.ఎంతటి విద్యాసంపద గలిగియున్నను,సామాన్యస్త్రీయే గదా. అందునను వివాహవయస్కయగు బాలయేగదా? అది యటులుండ మనముదానికై యోచింప నవసరములేదు. మన యువరాజును శాస్త్రజ్ఞానము గలవాఁడేగదా ! యువరాజే జయింపఁగలఁడు.అం దెంతయు సందేహములేదు. యువరాజునకు సహాయముగ విశ్వపతిపండితుని బంపుఁడు. తప్పక జయము గలుగును. ఇదియంతగొప్పకార్యము గాదు. దేనికిని యువ

రాజున కీసంగతి తెలియఁజేసి యతని ధైర్యమును కనుగొం దము* అనెను.

సభలోని పండితులందఱు గోవిందభట్టువాక్యములకు సమ్మతించిరి కాని కాళిదాసునకు మాత్రము దుస్సాధ్యమని తోఁచెను. కాని యేమియు మాటలాడకూరకుండెను. మహా రాజు సమ్మతినెఱిఁగినగాని యేమియు మాట లాడకూడ దను కొనెను. ఇంతలో యువరాజును సభకు పిలిపింపఁబడెను. వెం టనే పండితులందఱు యువరాజును మర్యాద జేసిరి. శూరనిధి యగు నారాజకుమారుఁడు తండ్రికి నమస్కరించి, యొకయుచి తాసనము నలంకరించెను. పితృభక్తిగల యాసత్పుత్రుఁడు తండ్రి యాజ్ఞకెదురు జూచుచుండెను. మదనసేనమహారాజు కాళిదాసు నుద్దేశించి పత్రికావృత్తాంతము తెలుపవేఁడెను. అటులే యువ రాజునకు పత్రికచదివి వినిపింపఁబడెను. అదివిని యువకుఁడగు యువరాజు "సెలవిత్తురేని నేనిపుడే బయలుదేరెదను. జయ మునుబడసి వచ్చెదను. దీనికి సందేహము లేదు." అనితండ్రితో విన్నవించెను. ఆమాటలకు గాళిదాసు 'ఓయువరాజా! నీవను కొని నటులను, గోవిందభట్టు పలికినటులను ఇది యంతసులభ ముకాదు. అది చాల దుర్ఘటమైనకార్యము. పత్రికయందు భోజ పత్రివ్రాసియున్న విధమున నది దేవరహస్యము. ఆభోజపుత్రిని జయించుట సామాన్యమని తలంపకుము. ఇప్పటికెందఱో రాజ కుమారులు ఆరాజపుత్రికను జయింప నిచ్ఛగలవారై యురు

దెంచి జయింపలేక దినమునకు వేయివరహాలచొప్పున నపరా ధముఁ జెల్లించి, యవనతముఖులై వెడలిరని నేనిటీవలనే వింటి ని" యని చెప్పుచుండ ద్వారపాలకుఁ డరుదెంచి ద్వారముకడ నొకపండితుఁడు గాచియున్నాఁడని మహారాజునకెఱుక జేసెను. వెంటనే యాపండితుని ప్రవేశమున కనుమతినిచ్చి పంపెను. సభలోని పండితు లందఱు ఆనూతనపండితు నెఱుఁగఁ గోరి యెదురు చూచుచుండిరి. ఇంతలో నానూతన పండితుఁడు సభా మంటపమున కరుదెంచి మహారాజు నీక్రిందివిధముగ నాశీర్వ దించెను.

శ్లో. శ్రీశృంగారపురాధినాథ మఖిలక్ష్మాపాలమూర్ధన్యస్ఫుర
ద్దైవ్యాదూర్వ్యాది సమస్తరత్నవిలసత్కల్యాణ పాదద్వయమ్,
గీర్వాణప్రముఖైః ప్రకీర్తితయశస్సౌభాగ్యభాగ్యోదయం
శ్రీమన్మన్మథసేనరాజ మనిశం పాయా దనాది స్స్మరః.

అని యాశీర్వదించి యుచితాసన మలంకరించి యోగ క్షేమము లఱసిన పిదప, మహారాజు ఆనూతనపండితునితో నిటులనెను. "ఓపండితోత్తమా! తామే దేశస్థులో, మీపాద స్పర్శచే నేయేదేశములు పావనమైనవో, యందందుగల విశే షము లేమియో, ఏయేరాజులు మీయాశీర్వచన భాగ్యమును పొంది సుఖులైయున్నారో తెలియఁజేయుఁ"డన నాపండితుడు "ఓమనుజేశ్వరా! నేను బాదముపెట్టని రాజ్యముగాని, నేఁ జూడని ప్రభువుగాని, భూలోకమున లేరు. పండితాదరణబుద్ధిగల

సకలమహీపతులను జూచితిని. అందఱియొద్దను మర్యాదలఁ
బొందితిని; కాని మీకెఱుకఁజేయవలసినవిశేష మొకటిగలదు.
ధారానగరపాలకుఁడగు భోజభూపతి సభను ఇటీవల సందర్శించి
తిని. అటఁగలపండితులును మంత్రులును మహారాజునకుఁ దగిన
వారే. పండితులనఁగ వారికే చెల్లును. రాజనఁగ భోజునకే చెల్లును.
అట్టిమహీపతికి యొకకుమారిత గలదు. దానిపేరు శారద.
విద్యయందును సౌందర్యముననను నసమానురాలు. మనము శా
స్త్రములయందును, పురాణములయందును, కావ్యముల
యందును విద్యాధిదేవతగ భారతి యొకటియున్నదని చదువు
దుము. అది మిథ్యయే. ధారానగరమును చూచినప్రతివిద్వాం
సుఁడును, ప్రత్యక్షశారదను చూడఁగలఁడు. ఆభోజుని భాగ్యమే
భాగ్యము. అట్టిప్రభువును మఱెచ్చటను నేను చూడలేదు. మహా
దాత. రాజకార్యధురీణుఁడు. సకలవిద్యావిశారదుఁడు. అట్టి
వానికి ఏకైకపుత్త్రికగ జన్మించినశారద శారదయే యగును.
ఆమె వివాహవయస్కయయ్యెను. భోజకులదేవతయగు భువ
నేశ్వరియాజ్ఞ ననుసరించి వరాన్వేషణమునాపి, ప్రతిజ్ఞానిర్వ
హణమునకు సమకట్టెను. సకలకళలయందును నాశారద
నెవఁడు జయించునో, వానికే యది ధర్మపత్ని కాఁగలదు.
ఇదియే ప్రతిజ్ఞ. ఆమెను జయించుపురుషుఁడు చతుస్సముద్ర
ముద్రితధరాతలంబున నుండఁడనియే నే భావింతును. ఆమె
భవననిర్మాణకౌశలము మహాపండితులకును చొరరాని

దుర్గము. అరువదినాలుగుకళలకును అరువదినాలుగుద్వార ములును, ఆయరువదినాలుగు కళలయందును ప్రతిద్వారము నొద్దను ఒకకళవంతున నామెను జయింపవలయుననియు, ఇన్ని యు నొకరాత్రిలోనే జరుగవలయుననియు వింటిని. ఇది ఏరికిని దుస్సాధ్యమే! అటుల జయింపలేక ఎందఱో మహారాజకుమా రులు అపరాధములఁజెల్లించి యవనతశిరస్కులై వెడలిపోయి రఁట. ప్రతిదినమునను నెందఱో వచ్చి వ్యర్థులై వెడలిపోవు చున్నారు. వేయివరహా లున్నఁగాని ప్రవేశము లభ్యముగాదు. అటుల వేయివరహాలతోఁ బ్రవేశించినను, విజయము సున్నయగు టయేగాక వరహాలును పీడును.

ఇది యిటులుండ నాశారదయొద్ద నిర్వురు చెలియలు గలరఁట. వారిలో నొకతె సకలవిద్యాప్రవీణ. మఱియొకతె సంగీతశాస్త్రమున నసమానురాలు. సౌందర్యమునను రతీ దేవికి సమానురాండ్రే. ఆశారదాదేవి ప్రత్యహాము భువనే శ్వరీదేవి సందర్శనార్థమేగుదెంచుట యలవాటఁట! ఆప్రకా రమే యొకదినము దేవీదర్శనముఁజేసి వెడలివచ్చు సమయ మున నే నట నుండుట తటస్థించినది. అపుడే ఆశారదా దేవిని యాకన్యకా పరివారమును జూచుటతటస్థించినది. ప్రథమ మునఁ గొందఱు నారీజనము ఇరువైపులవరుసగ ఛత్రచామర ముల ధరించినడచిరి. ఆపిదపను కొందఱు శ్రావ్యగానములఁ బాడుచు వచ్చిరి. పిదపఁ గొందఱు అశ్వారూఢులై ఖడ్గముల

ధరించి యుండిరి. ఆయనంతరమున నిరువురుయువతులు మందహాసముఁ జేయుచు శాస్త్రివాదము సలుపుచు వచ్చిరి. వాని పిదప, నొకపుష్పంపుపల్లకియందు చేటికలు గొందఱు పూసురటులచేతను వింజామరలచేతను వీచుచుండ, మఱికొందఱు బిరుదావళులు జదువుచుండ, ఇంకగొందఱు వీణావేణు మృదంగతాళాదివాద్యంబులు వాయించుచు నడచుచుండ, సుందరాకారముతోఁ గూర్చుండి శ్రీశారదాదేవివచ్చుచుండెను. ఆమె సౌందర్యమును వర్ణింప నెవరికిని సాధ్యము కాదు. ఇంతటి వైభవంబుతో వచ్చుచున్న శారద రతీదేవితో సమానమగు రామణీయకము గలిగి, కాంతామణుల మానసంబుల సైతము మరులుగొలుపఁ జేయునసమానలావణ్యంబుతో నొప్పుచుండెను. అట్టిసుందరమూర్తి యేలోకమునను నుండదనియే నాదృఢవిశ్వాసము.

సీ. విశదచంద్రుఁడైన వెలదినెమ్మోముసఁ
గలసిన సంపూర్ణకాంతి పడయు,
వడగాలియైన నప్పడతియూర్పుల చెంతఁ
బరఁగిన మలయాద్రి పవనుఁబోలు
నమవస యిరులైన నయ్యింతి చిఱునవ్వు
సొలపున వెన్నెల చెలువుఁబూను
నలరి యేబుతువుల నెలమి నాసతిమేలి
ప్రభఁ గన్న వసములు పల్లవించు
తే. బట్టబయలైన నా సితపద్మనేత్ర
కన్నుఁగవ యొప్పు బిగిసొంపు గడలుకొనిన

విమలకమలషండంబుల విధమునొందు
నెందు సరిపోల్పఁగలరె యయ్యిందుముఖికి?

క. బంగారునీరు నిలువున,
బొంగారుచు నుండ నజుఁడు వోసిన మాడ్కిన్
శృంగార మెల్ల నిలువున
బొంగారుచు నుండు గఱఁగిపోసినమాడ్కిన్॥

ఉ. మారునిమోహనాస్త్రిములమాడ్కి గటాక్షములుల్లసిల్లమం
జీర ఝుణంఝుణధ్వనులు చెల్వుగ్రమ్మోయ దరస్మితాస్యయై
సారెసఁ గార్తెఱుంగుక్రియఁజాలవెలుంగుచుఁజంద్రుపాలికా
దారివ యేగుచు న్మదదంతివిధంబునఁ జేరె మోహితన్.

తే. పుష్ప సుకుమార మైనట్టి మూర్తిఁదాల్చి
తనుతరం బగుమధ్యంబు తనరుచుండ
గమ్మవిల్తుని పార్శ్వభాగమున నున్న
కుసుమచాపమొ యనదేవి కొమరుమీరె.

ఇట్టి యసమానసౌందర్యవిరాజమాన యగు శారదాదేవి యామార్గమున వెడలి నిజమందిరముఁ జేరుకొనెను. ఆ శారదాదేవి వెనుకను కొందఱు చేటికలు హెచ్చరికలు సెప్పుచు, కొందఱు బంగరుకలశములును దేవీప్రసాదములును చేత నెత్తుకొని వచ్చుచుండిరి. ఇటుల పదివేల దాసీజనులు గొలువ మహావైభవముతో నామె వెడలిపోయెను. అట్టి యాకన్యకామణిని సకలకళలయందును జయించి పరిణయమాడువాఁడేధన్యుఁడు. ఎట్టివారు పోయినను, పరాభవమును బొంది వచ్చుచున్న వారలేనఁట! ఇంతదనుక నొకఁడైనను సమర్థుఁడు రాలేదు.

ఎందఱో మహీపాలకుమారులు వచ్చి యపరాధము చెల్లించి వెడలిపోయిరఁట! ఎవఁడు విజయమును బడసి, పరిణయ మాడునో భగవంతునికే తెలియఁగలదు" అని యచటి వృత్తాంతమును తెలిపెను. అదివిని సభాస్తారులందఱు నాశ్చర్య మానసులైరి. శృంగారకాళిదాసు ఆపండితుని వాక్యముల జక్కఁగా విని, మహారాజుతో నిటు లనెను. "ప్రభూ! ఈపండి తుఁడు వచించిన మాటలన్నియు యథార్థములే. దానికి మనము యోచింప నవసరము లేదు. నేనును యువరాజును వెంట నిడికొని బయలుదేరెదను. మనకు జయము సిద్ధము. యువరా జున కాకన్యకామణి లభించుటయు సిద్ధంబు. అందిసుమంతయు సందియము లేదు. నాకు వలసిన ఉపకరణములు సిద్ధముసేయింపుఁ డు. మీకు మోదంబొనఁగూర్చెదను. ఆసుందరి నివసించు హా ర్మ్యము మహాచమత్కారముతో నిర్మింపఁబడియున్నది. శాస్త్రి వాదమున జయించుట చాలసులభసాధ్యము. కాని హార్మ్య ప్రవేశమే మహాకఠినమైనది. అందనేకచిత్రములు గలవు. యువ రాజు వివాహానంతర మాచిత్రములన్నియు తాముచూడఁగలరు. దాని ప్రాశస్త్య మిపుడు వచించుట నిష్ప్రయోజనము. ఆచిత్ర ములఁ జూచియే తీరవలయును; కాన నేను యువరాజుతో సుము హూర్తమున బయలువెడలెదను. మమ్ము ప్రయాణసంసిద్ధులఁ జేయుఁడు" అనమహారాజు మొదట పండితుని వాక్యముల విని భయంపడినవాఁడై 'యువరా జెక్కడ? శారదను వివాహామాడు

టెక్కడ? ఇన్నియభ్యంతరములఁ గడచినగదా జయముగలు గుట? అయినను మా హితాభిలాషియగు శృంగారకాళిదాసుని సాయమున్నంతవరకు భయములేదు. అటులే చేసెద. సుము హూర్తమునబయలుదేరుఁడు. పరివారమును సిద్ధము సేయించె ద” నని కాళిదాసుతో సభనుచాలించి వెడలిపోయెను. పండితు లందఱును నేటితోఁ గాళిదాసుఁడు మనసభనుండి వెడలినట్టే యని సంతసించి యెవరియిండ్లకు వారు వెడలిరి. మహారాజు కాళిదాసును విడిచి వెడలిపోయెను.

మఱునటిదినము ధారానగరమునకు కాళిదాసుతో యువరాజును బంప నిశ్చయించి, మహారాజు దానికి వలసిన కార్యములఁ జేయ సమకట్టెను. తమ యశ్వశాలలోఁగల బల యుతములు గంభీరములు నగు రెండశ్వములసిద్ధము జేసియుంచిరి. నలుగురు సేవకులను వెంటఁబంప నేర్పాటు చేసెను. అన్నియు నాదినమే సిద్ధమయ్యెను. మహారాజు కాళిదాసునకు ప్రయాణ మునుగుఱించి తెలియఁజేసెను. ఆరేయి చాలకష్టముతో మహా రాజు గడపెను. వేకువనే యువరాజును లేపించి కాళిదాసుకై సేవకునిఁబంపెను. అప్పటికే కాళిదాసు ప్రయాణసంసిద్ధు డయి సేవకునితో రాజమందిరమును ప్రవేశింప సగౌరవ ముగ నాహ్వానించి, ఆరాజు శూరసేనుని కాళిదాసున కొప్పగించి, ప్రయాణమును సాగింపుఁడనెను. కాళిదాసు మదనసేనునియొద్ద 'నే నీశూరసేనునితో నరిగి కార్యంబు

సమకూర్చెదను. మీకు సంతసమును, ఖ్యాతియుఁ గలుగఁజేయు
దు నని సెలవుగైకొని శూరసేనునిఁజూచి "కుమారా! ధారాన
గరము నతిశీఘ్రముగఁ జేర్పఁగల యుత్తమాశ్వముల రెంటిని
దెప్పింపుము. మనము ముందుగ వెడలుదము. పరివారముగ
నియమింపఁబడిన నల్వురు పిదప వత్తురు. ధారానగరమును
ప్రవేశించిన తరువాత కర్తవ్య మాలోచింతము" అనెను. శూర
సేనుఁడును ఉత్తమాశ్వములఁ దెప్పింప నాజ్ఞఁజేసెను. ఇంతలో
నశ్వములును సిద్ధములై రాఁగా, నిర్వురు నధిరోహించి ధారాన
గరమార్గమును బట్టిరి. రెండుదినములు ప్రయాణముసాగించి
ధారానగరములోని భువనేశ్వరి యాలయమును చేరుకొనిరి.
సుహాకవియాజ్ఞ ననుసరించి నల్వురు సేవకులును వెనువెంటఁ
దగిలియటకుఁజేరిరి. అటజేరిన యందఱును అశ్వముల నొకచో,
విశ్రమింపఁజేసి తామును విశ్రాంతిఁబొందిరి. అప్పుడు కాళిదాసు
కుమమారా! మనమిట నే విడియుదము. ఆపండితుని వాక్యప్ర
కారము ధారానగరమునకును, భువనేశ్వరియాలయమునకును
మధ్యనే శారదామందిరము కలదు. మన మిట నుండుటయే
యుత్తమము. ప్రథమకర్తవ్యము పట్టణమంతయుఁ గలయఁ
జూచి యందుగలవిశేషముల గ్రహించుట. అనంతరమొకచో
సత్రమునవిడిసి, యందుఁగల సేవకులద్వారా శారదాదేవి మం
దిరవృత్తాంతమును, ఆయమకుఁగల భాషాపాండితియుఁ దక్కుం
గల దాసీజనుల విశేషములను, తెలిసికొనుట. పిదప శారదా

దేవికి మనవిషయము నెఱిఁగించి యామె నియమించు దినమున శారదాదేవి మందిరప్రవేశము సేయుట. ఇదియే మనకర్తవ్యము" అని యాలోచించుకొని, యటనే యారాత్రి యందఱు విశ్రమించి మఱుదినమున శీఘ్రముగనే లేచి, మహాకవియు శూరసేనుఁడును యటఁగల భువనేశ్వరి పుష్కరిణియందు స్నానాదికృత్యముల దీర్చికొని, యందఱు నటనేయుండ నాజ్ఞాపించి ఇర్వురుమాత్రము బ్రాహ్మణవేషధారులై పురప్రవేశమునకై బయలువెడలిరి.

---

# శృంగార కాళిదాసు

## చతుర్థ ప్రకరణము.

### ధారానగర ప్రవేశము.

ఇటుల శృంగారకాళిదాసును శూరసేనుఁడును బ్రాహ్మణవేషధారులై భువనేశ్వరీదేవియాలయమునుండి వెడలి కొండొకతడవునకు శారదామందిరమును సమీపించిరి. ఆహర్మ్యము కనకరత్నశిఖరంబులతోడ నొప్పుచు తీక్ష్ణకిరణప్రభాభాసమానంబై కన్నులకు మిరుమిట్లు గొల్పుచుండెను. ఆసౌధమందలి మణిగణము ఆకసమునొఱయుచు మందపవనుని భంగపఱచుచు అతిమనోహరముగ నాదమును చేయుచుండెను. అట్టియున్నత

మును మహానందదాయకము నగు నాసౌధంబునుదాఁటి ధారానగరమునుచేరి యందుగల నొక బ్రాహ్మణునియింట భోజనాదికృత్యముల నిర్వర్తించుకొని యాబ్రాహ్మణగృహస్థుని ద్వారా యందందుగలవిశేషముల నరసి, శారదాసౌధమునఁ గలవిశేషములను, ఎందఱో రాజకుమారులు శారదను జయించుటకై వచ్చి పరాజయమును బొంది యపరాధములఁ జెల్లించి పరాభవమంది వెడలిపోయిన వృత్తాంతమును, మున్నుగాగల వానిని తెలిసికొని, యాచోటువాసి యొకసత్రమును చేరికొనిరి. అందు మహాట్టహాసముతోను రాజఠీవితోను ఒకనూతన రాజకుమారుఁడు శారదతో వాదులాడ నిశ్చయించికొని, సపరివారుఁడై వచ్చియుండెను. అందు బ్రాహ్మణవేషధారుఁడైన మహాకవియు శూరసేనుఁడును కొంతతడవుండి యానూతనరాజకుమారునితో సంభాషించి సాయంకాలమగుటచే భువనేశ్వరి యాలయమునకు చేరికొన నిశ్చయించి యచ్చోటినుండి మరలిరి.

ఇటుల మరలి వచ్చుచున్న నాయిరువురు రాజవీధిఁ బోవుచు నందందు హర్మ్యపరిభాగముల విలాసార్థమున్న స్త్రీజనమునుజూచి, యాశ్చర్యపడుచు భువనేశ్వరి యాలయమార్గమున నడచుచుండ తమకెదురుగ నొంటరిగ వచ్చుచున్నయొక కోమలిని జూచిరి. దాని జూచుటతోఁ గాళిదాసుని మనము జలుమనియెను. శరీరమంతయు గగుర్పాటొందెను. ఆకోమలి

సౌందర్యము నిమేషమున కాళిదాసుని వశ్యము జేసికొనెను. తనతో వచ్చుచున్న రాజకుమారునిగూడ మఱచి, తదేక దీక్షగ నాసుందరిని జూడ మొదలిడెను. ఆసుందరి.

సీ. కమనీయకాంచన కమ్రచేలముఁగట్టి
మోమునఁగస్తూరి బొట్టు దిద్ది
కుసుమదామంబుల గొప్పకొప్పమరించి
నవ్యమణీ భూషణములు దాల్చి
పొందుగా మైనిండఁ జందనంబు నలంది
సొగసైనరత్నకంచుకము దొడిగి
కప్పురంపువిడెము చక్కఁగఁ గొరికి ఓట ధరించి
బెళుకారువాలుచూపులు సెలంగ
భువనమోహన వేషయై భూరికుచ ని
తంబ భారంబుచే మత్తదంతికరణి
హంసిచందాన నడుచుచు నంచితముగ
మించుగతి రాజవీథి నేతెంచుచుండె.

సీ. బంభరీ భూషిత పంకేరుహంబులు
నగునొప్ప నయనానన ములు సేసి
జలభంగ సంచల చ్చారుచక్రంబులు
గమనీయ కుచనితం బములు సేసి
భూరిసౌరభలుబ్ధ పుష్పంధయశ్రేణి
తీరైన జడయును నూగారు సేసి
పొందుగా విరిసిన కెందమ్మి రేకులు
చరణయుగ్మాధర హస్తములు సేసి

మొలకనవ్వులు నునుతొడల్ వలుదచెక్కు-
లలరువాభియుఁ గలదు లే దనెడుగాను
వళుల సాక్షాత్కరించిన సరసిలక్ష్మి
వైఖరిఁ జెలంగుచున్న యవ్వనితఁ జూచి.

ఉ. పచ్చలకంకణమ్ములను భాసిలు దాపలికేల జాఱువా
కుచ్చెలకొంగుఁ దాల్చి తళుకుం దెలి చెక్కులు చెమ్మరింపఁగా
హెచ్చుపిఱుందుభారము సహింపక నెన్నడలింత కొంకఁగా
నెచ్చటనుండి యిచ్చటికి నేఁగెడినో యిది యొంటిపాటునన్?

అని మహాకవి సందేహించి తనమనంబున

ఉ. చన్నులక్రొవ్విదంబుఁ గటిచక్రపుఁ బెంపును మోవికెంపుఁ గ్రొ
గన్నులసోయగంబు నలకంబులకప్పును మేనికాంతియున్
దిన్ననికాను నెమ్మొగము తీరును జూడ్కికి విందుసేయఁగా
నన్నలినాక్షి యొప్పు విషమాయుధుమోహనశక్తియో యనన్.

ఇట్టి యసమానసౌందర్యనిధి యెవరోగదా! ఒంటరి పాటున నీసాంధ్యసమయమున నడచుచున్నది. ఇది దేవతాస్త్రీయో, లేక నాగకన్యయో? ఇంతటి సౌందర్యనిధిని నేనెన్నఁడుచూచి యెఱుఁగనే. ఇది బహుశః దేవవేశ్య యగునేమో! అయినఁ గనుంగొనెదఁగాక! యని తలపోసి యాకన్యను సమీపింప నుద్యుక్తుఁడై యుండఁగా—

సీ. చిగురుటాకులమీఁది జిగి బాగుగాఁ [illegible]ర్చి
యడుగు దమ్ములుగాఁగ నలవరించి
కొమరారు నరఁటికంబముల సోయగ మెల్ల
తెచ్చి యూరులుగాఁగ నచ్చువతిచి

పసిడికుంభంబుల మిసిమియంతయు గూర్చి
యొగి జన్నుగవగాఁగ నోజపఱిచి
యలికులంబులమీఁది హరినీలరుచి నూడ్చి
కర మొప్ప నెఱివేణి గా నమర్చి
కడఁగి బయలావటించి నెన్నడుముఁ జేసి
కలువరేకులఁ గన్నులు గా నమర్చి
పంచశరుఁడేర్చి చేసిన ప్రతిమ యనఁగ
నువిద చనుదెంచె శృంగారకవిసరసకు.

అటుల వచ్చిన యాసుందరాంగిని గని శృంగారకవి యంతవఱకు స్త్రీలతో మాటలాడియెఱుఁగని కారణముచే లజ్జితుఁడై యెట్టకేలకు ధైర్యము వహించి, 'ఓలతాంగీ! ఒంటి పాటున నీసాంధ్యసమయమున నెటనుండి యెటకు వెడలు చున్నావు? నిర్భీతివై వెడలుచున్నదానవే ఏమికారణము?" అని యడిగిన నీవిధముగ బ్రత్యుత్తర మిచ్చెను.

"ఓ విప్రవర్యా! తా మీరాజధానికి నూతనులవలె గన్పట్టువారలు. నేను శ్రీభోజభూపతిపుత్రికయగు శారదాదేవి యొద్దనుండు సంగీతవిద్వాంసురాలను. ఇపుడు శారదాదేవిమందిరమునుండి నాగృహమునకు చనుచుంటిని. ఈదిన మెవరును వివాదమునకు రాలేదు. దానిచే నే వెడలుదానను, తా మేదేశపు వారలో చెప్పి, నన్నానందింపగోరెద. తమ్ముఁ జూచిన మహావిద్వాంసులవలె గనఁబడుచున్నారు. ఈసాయంసమయమున నీదారిననెందు పోవుచున్నారు? పట్టణముననే యుండ

రాదా!" యనెను. అదివిని నూతనోత్సాహమును చిఱునగవును దోఁప యాకోమలితో నిటు లనెను. "ఓకోమలగాత్రీ! మీాశారదాదేవితో వాదులాడ నేటికెవరును రాలేదని చెప్పియుంటివే. అదేమిరెయో వివరముగఁ జెప్పఁగలవేని యాలకింపమాకు కుతూహలము పొడము చున్నది. మఱియు నాభవనమెఱఁగలదో యందుగల విశేష మేమిరెయో యెఱిఁగింతువేని నీనుల విందుగ వినఁగలను" అన విని తనమనంబున నిటు లనుకొనెను- వీరెవరో రాజవంశసంభూతులవలె గనఁబడుచున్నవారు. వీరట కరుదెంచుట మనదేవితో వాదులాడుటకే యై యుండును. మనలఁ బరిశోధింప నిట్టి ప్రశ్నల వేయుచున్నవారలు. అయిన వీరివృత్తాంత మెఱుఁగనిది నేనేదియుఁ దెలుపరాదు- అని యనుకొని "ఓవిప్రవర్యా! మీారలెచటివారలు? ఏకార్య సాఫల్యతకిట కరుదెంచినవారలు; తమనామధేయములేమియో చెప్పిన యనంతరము మీాప్రశ్నలకు సదుత్తరం బిచ్చుదానను" అన కాళిదాసిటు లనెను. "మేము మదనసేన మహారాజ పరిపాలిత రాజధానియగు శృంగారపురనివాసులము. నాపేరు శృంగారకాళిదాసందురు. మేము ద్విజులము. మహారాజాధిరాజులను దర్శించి, మాకెఱుకగల విద్యలను ప్రదర్శించి, బహుమానములఁ బడయునుద్దేశముతో భూసంచారము సేయుచున్నారము. శ్రీభోజభూపతి విద్యావిశారదుఁడనియు,విద్వజ్జనులపాలి కల్పతరువనియు, మహోదాతయనియు విని

రాజదర్శనార్థ మేతెంచినవారము. మహీపతియగుభోజరాజువృ త్తాంతము వదలి భోజపతిపుత్రికవిషయముఁజెప్పుటచే, ఆదేది యోకనుగొనఁ గుతూహలము వొడమినది. అంతియకాని మతేమియు లేదు. స్త్రీతో, అందునను రాజకుమారితో నెవరు వాదమునకు వచ్చెదరు? దానికథ వివరింపుమన విని యామగు వదృష్టుల నిగుడించి చెప్పవాల్పక కాళిదాసు నవయౌవనమును, సౌందర్యమును గాంభీర్యమును వాక్కులను, శృంగారకాళిదా సను పేరునుతలచియచ్చెరువంది తనమనసున ననేకవిధములగుకో రికలువొడమ, స్తంభించి నిలబడెను. కవియు తనదృష్టులప్రసరింప జేయ నారెండును నేకమై పరస్పర స్నేహపాశబద్ధములై యొకని మేషకాల మటులేయుండెను. వారుఆచూపులోనే తమకు కలిగిన భావములప్రకటించుకొనిరి. కాళిదాసు ఈ కోమలి సాయముచే మనము సులభముగ శారదనుజయింపవచ్చునను కొనెను. ఆసుం దరాంగియు కాళిదాసుని యతిరమణీయాకారమును జూచి మోహించి, ఇట్టిమోహనమూర్తిని పొందినఁగదా మనజ న్మము సఫలమని యనుకొనెను. అపుడు తనవృత్తాంతమిటుల నామె చెప్పఁదొడంగెను. "ఓసుందరుఁడా! నేను ఈ ధారా నగరవాసిని. సంగీతవిద్య మాకుఅభిమానకళ. నాపేరు కాంచ నమాల యందురు. నాతల్లిపేరు కనకలత. మహారాణి యగు లీలావతీదేవికి సంగీతము వినిపించి, సంతసింపఁజే యుటే మాకులవృత్తి. నేనిపుడు శారదాదేవి మందిరము

నుండి నాగృహమునకు పోవుదానను" అనిచెప్పి 'రాజదర్శనము లభించినదా' యని ప్రశ్నించెను. దానికి మహాశవి 'లేదు. ఈదినమే యీపట్టణమునకు వచ్చితిమి. భువనేశ్వరి యాలయసమీపమున విడిసియున్నారము. రేపటిదినము శారదాదేవిని జూడవలయు నని యాసక్తి యున్నది. దానికి నీసాయమత్యవసరము. శారదాదేవిప్రజ్ఞయు నటఁగల దాసీజనుల సామర్థ్యమును, భవన చిత్రములును వివరముగ మాకుఁ దెలుపుదువేని అంతియ చాలును' అనెను.

కాంచనమాల వదనము మందహాసముతో నిండెను. శారదాదేవి వృత్తాంతమిషచే నితనిని సులభముగఁ బొందవచ్చుననుకొనెను. అంత చిఱునగవుతో నిటులనెను. "మాదేవివృత్తాంతముఁ జెప్పుట కిది యదనుగాదు. రేపటిసాయంకాలము మాగృహమునకు దయసేయుదురేని వివరముగఁ జెప్పఁగలదానను. మాతల్లి నారాక కెదురు చూచుచుండును. కాన నిప్పటికే చాల ప్రొద్దుపోయినది. నేను త్వరితముగఁబోవలయు న"ని భీతహారిణివలెను వెడలిపోయెను. కాళిదాసును రాజకుమారుఁడును త్వరితముగ భువనేశ్వరీ యాలయమును చేరికొనిరి.

ఆచోటు వదలినప్పటి నుండియు కాళిదాసునకు మనసు నిలుకడ దప్పెను. కాంచనమాలవాక్యములే యతనిచెవులఁ బ్రతిధ్వనింపఁ దొడఁగెను. ఏకార్యము నొనర్చుటకుఁ దోఁచ

కుండెను. ఆయొక్క రాత్రియు నొకయుగ మయ్యెను. నిద్దుర కంటికంట భయబడెను. 'ఎపు డుదయమగునా? ఎపుడు కాంచనమాల దర్శనమబ్బునా?' యని యెదురు చూచుచుండెను. మదనాగ్ని బాధితుండైన వానిని హింసింప నిష్టములేనివాడై బాలభానుఁడు—

తే. అర్ధమండల ముదయించు నమృతభాను
డుదయరాగంబుతోఁగూడ నొప్పుమిగిలె
బ్రకటతాంబూల రాగ సంరక్తమైన
ప్రాగ్దిశాకాంత యధర బింబంబువోలె.

భగవానుఁడు తూర్పుదిక్కున నుదయాద్రి నధిరోహించెను. శృగారకవియు అమందానంద భరితుండై కాల్యకృత్యములఁ దీర్చికొని కాంచనమాల చెప్పినవేళకై యెదురుచూచుచుండెను.

కాళిదాసును వదలిన కాంచనమాలయు నెంతోకష్టమువిూదనిలుసేరెను. తనపుత్రికారత్నముగాక కెదురుచూచుచు విచారపడుచున్న కనకలతయు కాంచనమాలనుచూచి సంతసముపొడమ చెక్కిళ్ళముద్దాడి లోనికిఁ గొనిపోయెను గాని కాంచనమాల కది భరింపరాని దయ్యెను. అదేకాళిదాసుఁడై యుండిన జన్మము సార్థకమని తలఁచెను. కొంతతడవునకు భోజనాదికృత్యముల ముగించి శయనించిరి. కాని హంసతూలికాదులతోను, సుగంధముతోను నిండఁబడిన యాశయ్యాగృహమామెకు కారాగృహమై తోఁచెను. కొంచెమునేపు శయ్యపై

పరుండును. కంటికి నిదురయుంటదు. కొంతసేపులేచి తిరుగా
డును. మఱలపరుండును. ఏమైననేమి నిద్రాదేవత కటాక్షవీక్షణ
ములు తప్పిపోయెను. కాంచనమాలయం దామెకు కృపకలుగ
దాయెను. చంద్రుడొకవైపున బాధింపఁ దలపడెను. మందమా
రుతము మఱియొకప్రక్కను, కాంచనమాలను బాధింప సమ
కట్టెను. ఏమిచేయును? ఏమియు నెఱుఁగని ముగ్ధ కాళిదాసునివా
క్సుధను గ్రోలినప్పటినుండియు నాపలుకులు కర్ణరసాయనములై
ప్రతిధ్వనించుచుండెను.

సీ. విరి పొన్నపై వ్రాలి పొరలు లేచువడంకు
నలుఁగడ లట్టిట్టు కలయఁజూచుఁ
బిలువక పల్కు మేనులికి పోనుబ్రుడిగ్గు
తలయూఁచు గనుమూయు గళవళించుఁ
దనలోన దను నవ్వు గినుకదైవము దిట్టు
వలయుక గొనియుస్సు రనుచు మూర్ఛు
బలవరించు వివేకమెలమిడించుఁ గరంబు
లప్పళించును బయలలిమి కొనును
మోహముదమించుఁ బులకించు మోమువంచుఁ
తెలివి మదినెంచు వగమించుఁ దెగువఁ గాంచు
నెదురగమకించు నూరక బెదరుకొంచు
మదన బాధలకోర్వ దమ్ముగ్ధయటుంచు.

ఇట్టియవస్థల నందుచున్న యాముగ్ధకు రాత్రియంతయుఁ
జాగరణమే శరణ్యమయ్యెను. ఉదయసూచనలు దూర్పునఁ గనఁ
బడఁజొచ్చెను. కాంచనమాలస్థితికి పరిహసించుచున్నటుల పక్షు

లరణగాణధ్వని చెలరేగెను. రాత్రియంతయు తనతీక్ష్ణ కిరణము లచే బాధించినచంద్రుఁడు తనకృత్యమునకు సిగ్గుజెందెనో యన్న టుల వెలవెలబోవుచుండెను. బ్రాహ్మణ పండితసమూహము తమశిష్యవర్గముతో గూడి భజగోవింద కీర్తనల బాడుచు స్నానార్థము వెడలుచుండిరి. ఇంతలో బాలభానుడు నుదయా ద్రిపీడి భూలోకవిశేషముల నరయ బయలువెడలెను. రాత్రి అంతయు నిదురలేమిచే నప్పటిచంద్రబింబమువోలె వెలవెల బారినముఖముతో కాంచనమాల కాల్యకృత్యములఁ దీర్చుకొని సాయంకాలమునకై యెదురుచూచుచుండెను. ఆదినము పౌర్ణ మియగుటచే కాళిదాసురాకున్న తనగతి యేమగునో యని విచారపడఁజొచ్చెను. గతరాత్రి వృత్తాంతమును దాసిద్వారా కాళిదాసున కెరుకపరుప నిశ్చయించెను; కాని మరలసిగ్గుచే వెనుదీసెను. ఇటుల విరహబాధ కోర్వలేకయుండెను. ఎట్ట కేలకు ఆదినమును బహుకష్టముతో గడపెను. భానుడును యీవిరహిజనుల బాధింప నిష్టములేనివానివలె నున్నాఁడో యన నస్తాద్రిగ్రుంకెను. పక్షులెల్ల దమతమగూండ్లకు జేరు కొను సంభ్రమముతో రివ్వున నాకసమున నెగురుచుండెను. రాత్రినెదురు జూచుచుండిన కామినీకాముకులు దమతమ పనుల నిర్వర్తించుకొని ఒకరినొకరు సంధింప కుతూహలపడువారి వలె యువతీయువకులు గానబడిరి. తూర్పున విరహిజనులకు విషప్రాయుఁడైన కలువలరేడు దేదీప్యమానమగు వెలుగుతో

నెవరెవరేమి జేయుచున్నారో కనుగొన నిచ్ఛగలవానివలె ఉదయాద్రినుండి తొంగిచూడ మొదలిడెను. యువతీ రత్నములు చక్కగ నలంకరించుకొని భర్తల రాక కెదురు జూచుచుండిరి. ఇట్టివిషమస్థితియందు కాళిదాసు త్వరగ తమతోడివారి నటదిగవిడిచి పట్టణాభిముఖుఁడై బయలు దేరెను. కాంచనమాల తన శయ్యాగృహము నలంకరింప జేసి శృంగారకవికై యెదురు చూచుచుండెను. ఇంతలో కాళిదాసు భువనేశ్వరీ యాలయ మార్గమును దాటి రాజవీథి ప్రవేశించి, కాంచనమాల జెప్పినవిధమున మార్గమునన్వేషించుచు నొకచోట నిలబడెను, సౌధోపరిభాగమున కాళిదాసుకై జూచుచుండిన కాంచనమాల వడిగదిగి కాళిదాసుదోడ్కొని లోనికిపోవ నుంకించెను. అపుడు శృంగారకవి సరసుఁ డగుటచే గాంచనమాల నీవిధముగ వర్ణించెను.

> ‘ ఝుడితి ప్రవిశ గేహం మా బహిస్తిష్ఠ బాలే
> గ్రహణసమయ వార్తా శ్రూయతే శీతరశ్మేః
> తవముఖ మకళంకం వీక్ష్య నూనం సరాహుః
> గ్రసతి తవ ముఖేందుం చంద్రబింబం విహైవ.’

“ఓ బాలా! త్వరగ గృహములోపలికి బొమ్ము. వెలుపల చరింపకుము. ఈదినము చంద్రునకు గ్రహణకాలమని యందఱు జెప్పుచున్నారు, కళంకరహితమైన నీముఖబింబమును జూచెనేని రాహువు కళంకసహితుడైన చంద్రునివదలి నీముఖమును మ్రింగివేయును ” ఈవాక్య చతుష్టయమును విని యతని

కవిత్వమునకును రసికతా విశేషమునకును ముదమంది యతని కవితామృతమును గ్రోలదలచి మౌనమువహించిన యాజాణ భావ మెఱింగి, కంచుకవిహీనయై యున్నది గని,

"కనకాంగి కలయ కంచుకి మనయో స్తనయో ర్జవేన ఘనతరయోః,
పురుహూత దిగ్విభాగా దుదయతి కోకారి ద్య పరిపూర్ణః."

" ఓకనకాంగీ! ఘనతరములగు నీపయోధరములు గనబడకుండ రవికె దొడుగుకొనుము. ఇవి చక్రవాకములగుటచే వానికి శత్రువగు చంద్రు డుదయించుచున్నాడు."

ఈ యమృత తుల్యములగు వాక్కులవిని యతనిచతురతకు మెచ్చుకొని త్వరితగతి లోనికిజని రవికెదొడిగికొని నిలువుటద్దమున తనయందము జూచుకొని మరల కవివద్దకువచ్చి యారసికశ్రేష్ఠు నెదుర్కొనెను. అపుడు శృంగారకవి అనురాగ సూచకములగు చిఱునగవుతో నొప్పుచు తనకటాక్ష వీక్షణముల కనకాంగిని జూచెను. కాంచనమాల యాచూపులకు లజ్జితయై హస్తములఁ బైకెత్తి ముఖమును మరుగుపరచెను. అదిగని కవిచంద్రుడు

'ఉచితం గోపనమనయోః స్తనయోః కనకాద్రికాంతితస్కరయోః,
అవధీరితశశిమండల ముఖమండల గోపనం కిమితి.'

"బంగరుకొండకాంతిని హరించిన యాస్తనములదాఁచుట యుచితముకాని చంద్రబింబమును దిరస్కరించు నీముఖమును దాఁచుట యుచితమా"

అదివిని కాంచనమాల ముగ్ధయగుట సిగ్గుచే దలవంచి, కవివాక్యములకు మనమునఁ బ్రేమించియు కొంత నిలబడెను. పిదప ఎట్టకేలకు ధైర్యముబూని తనహస్తములతో మహాకవి చేతులఁ బట్టుకొని సగౌరవముగ లోనికి బిలుచుకొని పోయి శయ్యామందిరము బ్రవేశించెను. కాళిదాసు కాంచనమాలలు ఆరాత్రి తమయిష్టార్థముల నెరవేర్చుకొనిరి. అనంతరము శారదాదేవి వృత్తాంతమును భవనవిశేషములను చక్కఁగఁ దెలిసికొని తా వచ్చిన వృత్తాంతమును, తనతో వచ్చియున్న రాజకుమారుని వృత్తాంతమును దెలిపి, శారదాదేవిని జయించుట యందు తనకు సాయపడవలెనని కోరి వాగ్దత్తము దీసికొనెను. నాటనుండియు కాళిదాసకాంచనమాలలు సుఖసామ్రాజ్యము నేలుచుండిరి.

---

# శృంగార కాళిదాసు

## పంచమ ప్రకరణము.

### శారదాదేవితో సంవాదము.

మఱుదినముదయముననే శృంగారకాళిదాసు కాంచనమాలగృహముపీడి భువనేశ్వరీ యాలయమును జేరెను. కాళి

దాసు నెదురుచూచుచుండిన యువరాజు వానిని గాంచి సంత
సించి విశేషములఁ దెలిసికొని యారాత్రికి శారదాదేవితో
వాదులాటకై నిశ్చయించి యొకకమ్మను వ్రాసి శారదాదేవి
కంపిరి. కాళిదాసురాక నెరిగియుండిన కాంచనమాలయు
ఉదయముననే శారదాదేవి మందిరమును చేరెను. అప్పుడే
కాళిదాసుచే నంపబడిన లేఖయు శారదకు సఖీజనులందిచ్చిరి.
అదిచదువుకొని 'హేళనగ మూడుదినములనుండియు నెవరు లే
దనుకొంటిని. పిచ్చివాడెవడో వాదులాడ సిద్ధపడినాడు. రాని
మ్ము.' అని తనసఖియగు కాంచనమాలద్వారా తనయంగీకార
మును తెలుపు నొక పత్రమును నంపెను. కాళిదాస యువరాజు
లద్దానిని చదువుకొని శృంగారకవి రాజకుమారునితో నిటు
లనెను. "ఓకుమారా! కడచినరేయి నే వినిన విషయముల
వలన మనము శారదా సౌధమునకు వెళ్లుటకు పూర్వము
నింబఫలము, దండంబు, తైలక్షాళితవస్త్రిఖండము వెదురు
బద్ద, గంధకపు రాయి చిన్నదగుఱాయి, గండుచీమలు, ఇక్షు
ఖండంబు--, ఎఱ్ఱప్రత్తిపూలు, ఎండ్రకాయ, మల్లెపూలు,
అరటియూచ, వీటిని సేకరింప వలసియున్నది. సాయం
సమయమునకు ముందే ఇవి యన్నియు సంపాదించి భద్ర
పరచుకొని బయలు వెడలవలయు నన రాజకుమారుఁడు
సేవకున కాజ్ఞయిడి యిరువురును భావికార్యములను చర్చించు
కొనిరి.

సాయంకాలమునకు ఆ యిర్వురు బ్రాహ్మణవేషధారులై భువనేశ్వరీదేవి నారాధించి యాశీర్వాదములను బడసి శ్రీశారదా మందిరాభిముఖులై కొంతదవ్వు నడచినపిమ్మట శారదా సౌధమును పొంది వీథి వేదికపై గట్టబడిన ఘంటను మోగియించిరి. ఆనాదమునకు మొదటి హజారమున కావలిగ నున్న యిర్వురు వార్తాహారిణులరుదెంచగ కాళిదాసు "మీ దేవి యగు శారదా దేవితో వాదులాడవచ్చితిమి గాన సమయము గనుగొని రమ్ము" అని పలికెను.

వార్తా:—తా మేదేశప్రభువులో మేము వినవచ్చునా ?

కాళి:— మేము శృంగారపుర వాస్తవ్యులము, ద్విజులము.

అదివిని యావార్తాహారిణి వెంటనే శారద కెరుక జేయ, లోనికి రమ్మనమని దేవి యాజ్ఞయిడగ త్వరితముగ మొదటిహజారమును దాటించెను.

రెండవహజారమున నిర్వురు సఖులుండిరి. వారితో మొదటి హజారమున జెప్పినటులే చెప్పెను గాని వారలు వినిపించు కొనలేదు. మహాకవిని, యువరాజును, జూచి ముసిముసినవ్వులు నవ్వుకొనుచు 'ఈవిప్రోత్తములా మనరాణిని జయించువారలు ? సౌందర్యమున నసమానులై యుండినను, శుద్ధఛాందసులవలె నగుపడుచున్నవార' లని హేళనజేయ, కాళిదాసు

క. విను మీరిరువురును నిస
ర్గనిరూఢ ప్రేమబంధ కలితులె కల్హా
రిణి శ్రీరాత్రులవలె నే
ననగా శశివంటివాడ నంతియచూడన్.

అనవిని వారలు సిగ్గుజెంది కవిత్వమాధుర్యమునకు మెచ్చుకొనుచు సరసత కుప్పొంగుచుండ యాహజారమును దాటి మాతియొక హజారము కడకు వెడలిరి.

ఆ హజారమునను నిర్వురు దాసీజనులు కూర్చొని యుండిరి. వారలు కొంతవిద్యావతులుగ గనుపించిరి. వీరిని జూచినతోడనే దాసీజనము మర్యాదగలేచి నిలబడి వచ్చిన కార్య మే మని యడిగిరి. అందుకు మహాకవి 'మీ ఏలి కను వాదులాటలో జయింప వచ్చినవారము. ఈసంగతిని మీదేవికి దెలియ సేయు' డన వా రిరువురును గొంతవడ వొండొరులను జూచికొనుచు ఫక్కు నన వ్వ గా శృంగార కవి—

తే. పల్లవరుస యింతకానంగబడగ మంద
హాస మొనరించు నీవిశాలాక్షి మోము
కేసరంబు లొక్కింత లక్షింప నయిన
కమలమును బోలి యందమై కానిపించు.

అని పరిహాసముగను చమత్కారముగను వచించెను. దానికా కామినులు లజ్జావనత వదనలై వానిసామర్థ్యమున

కలరి మెచ్చిరి. అంత కవియు నిదేసమయ మని యాహాజార మును దాటెను.

నాల్గవద్వారమును సమీపించునప్పటికి యటగలవార్తాహారిణి ఆయిర్వుర నడ్డగించి "మీరెక్కడివారలు మారాణి యాజ్ఞయు మాయాజ్ఞయులేనిదే లోనికి ప్రవేశించుచున్నారు. ఎటకువచ్చితిరి?" అనవిని కాళిదాసు సరసముగ నామెతో "మీ యేలిక నుజయించి పరిణయమాడుటకై వచ్చినవారము. అట్టి మమ్ము నీ వేల యడ్డగించెదవు. నిన్ను పరిణయమాడుమనియా నీ వడ్డగించుట? అది మేమొల్లము అని యనెను. దాని కాదాసి కుపితయై "ఓయివిప్రుడా! నీవు చాల గడుసుదనముగ మాటలాడెద వేల? నీపాండిత్యమిటచూపుము. పిదప మాఏలికను జయింతువు గాక" అని గద్దించెను. దానికి శృంగారకాళిదాసు చిరునగవుతో 'సుందరీ! ఎందులకు కోపించెదవు? మేమైనను మీరాణిని జయించియే తీరెదము గానవివాహముసిద్ధము. నీకేల యంత రోషము? మీ రాణి బ్రహ్మచర్యదీక్షగైకొనలేదుగదా? జయించినవానిని పరిణయమాడుటకూడ సిద్ధంబేగదా?" యన నావార్తాహారిణి మాటలాడుటయందు సామర్థ్యము గలదైనను ఈమాటలకు ప్రత్యుత్తర మీయలేకపోయెను. అప్పుడు శృంగారకవి

ఉ. ఓర్పొకయింతలేని వికచోత్పల లోచన చిత్తవీథిఁ జ
ల్లార్పఁగ నీలనీరదశుభాంగుఁడు వే సను బంచె నంచు గం

దర్పహుతాశను న్వోలికి దార్పసఖుండును బోలె వేడి ని
ట్టూర్పు దళంబుగా నిగిడె నున్నమితావరణాంశుకాంత మై.

అని చదువగ విని సిగ్గుచే దలవంచి మారుమాటాడ కుండెను. అపుడు శృంగారకవియు యువరాజును నాద్వారమును గడచిరి.

ఇటుల సనిన మహాకవిని గుఱించి, యానాలుగు హజారములలోనివారును నొకచోఁ గుమిగూడి "ఏమి యీచిత్రము! ఇంతదనుక నింతటి కవిసార్వభౌముఁ డెవఁడును రాలేదు. ఇట్టివారలేక దా పండితులును కవులు నగుదురు. ఇంతవరకు వచ్చినవారలు మనరాణి చెప్పిన పద్యభావములు జెప్పలేక అవకతవకలై అపరాధధనమును జెల్లించి మనచేతను నవమానముల జెంది వెడలిపోవుచుండిరి. ఇతఁడు చక్కనికవితఁ జెప్పుట యేగాక భావమును సరసత్వమును గలిగి, పీనులవిందొనర్చుచున్నాఁడు. ఈకవి తప్పక మనయేలికను జయించియే తీరును" అని మాటలాడుకొని యెవరిస్థానమునకు వారు వెడలిపోయిరి.

శృంగారకవి యైదవద్వారమును సమీపించి యందున్న యొకచక్కని చిన్నారిని జూచి, తనమనసున నిటుల నూహింపఁదొడగెను. "ఇదియే శారదాదేవియై యుండనోపు. లేకున్న నింతటి సౌందర్యము వాకిలిగాయు స్త్రీలకు యుండునా? ఏమి యీయందము! విధాతసృష్టి నిజముగ నీసుందరియందు మెచ్చఁ

దగినదే. పరీక్షించియే పితామహుఁడు ఈమెను సృష్టించి యుండును" అని యనుకొని ఇటుల వర్ణించెను.

చ. చెలువుగ వ్రాసి దిద్ది విధి చిత్తము గంజిల జీవమిచ్చి నా
పొలుపుల గూర్చి మానసవిభూతిని గౌతుకియై రచించెనా
మెలతుక మేనుజూడ బరమేష్ఠి ప్రభావము నెంచిచూడ నా
నెలఁతుక దోఁచు నొండు తరుణీమణి సృష్టియటంచు నామదిన్.

ఇట్టి సుందరిని వర్ణించుట కేరికిని సాధ్యముగాదు. దీనిని పలుకరించియైన ధన్యుఁడనయ్యెదనని యాద్వారమును సమీపించెను. అంతలో నటనున్న సుందరి వినయముతోఁ దన యాసనము వీడి లేచి, మర్యాదగ "మీరెవరో మీకార్య మేమియో దెలియఁజేయుడు. దానిని మారాణి కెరుక జేసి ఆమె యాజ్ఞను తమకు దెలుపుదు నన" ఆవాక్యముల కలరి "ఓకలకంఠీ! నీవాక్యామృతమునకుఁ దనివి సెందితిమి. మీ యేలికతో వాదమునకు వచ్చినారము. మీదొరసాని కెఱుకఁ జేసి ప్రత్యుత్తరముఁ జెప్పుము. అంతియే నీవు చేయఁదగిన పని." అన నటులె యని త్వరగ లోనికి వెడలెను. మఱియొకసారి దానితో మాటలాడి యొకపద్యము జెప్పుదమని తలఁచి యట నుండెను. ఇంతలో లోనికి వెడలిన యానారీరత్నము శ్రీంగారకవితో నిట్లు లనెను "మాయేలిక యాజ్ఞయైనది. తామీ ద్వారమును దాటి లోనికి వెడలుఁడు" అని చెప్పెను. వెంటనే మహాకవి యాద్వారమును దాఁటి లోని కరిగెను.

ఇటులఁ గ్రమముగ నెనిమిది కక్ష్యాంతరముల దాటి తొమ్మిదవ కక్ష్యాంతరమున నున్న వార్తాహారిణి మహాకవిం జూచి "ఓపండితోత్తమా! మీరీ భవనమును ప్రవేశించి చాల కాలాతీతమైనది. మీరిటఁ బరుండి కొంతతడవు నిద్రింపుడు. చాలశ్రమఁ జెందినటుల గనఁబడుచున్నవార" లని యుపచరించెను. అదివిని పండితుఁడు "ఓసాధ్వీ ! నీయుపచారములకు మెచ్చితిని ; కాని నాకుగలప్రతిజ్ఞ తీరినగాని నే నిదురింపను. ప్రతిజ్ఞ యేమందు వేని, నీయేలికను జయించినగాని కంటికి నిదురరాదు. కాన దయచేసి నీయేలికకు తెలియఁజేసి వాదమునకు రమ్మనమనుము." అది విని యామందగమన వెంటనే లోనికేగి, తనరాణి కాసంగతిని జెప్పెను. శ్రీశారదాదేవి మనసున భయముదోఁప "వీఁడు మనల జయించుట తప్పన ట్లున్నది. వీఁ డెవఁడో రాజకుమారుఁడో లేక విప్రుఁడో తెలియరాదయ్యె. దాసీజనులు చెప్పినది చూచిన మంచి సరసుఁడై యుండనోపు. మహాకవియునై యున్నాఁడు. ఏమైనను సరియే ఈరాత్రి వీనితో వాదులాడక తప్పదు. ప్రథమమున గొన్ని కుయుక్తులఁజేసి చూచెదము. ఫలించెనా తప్పవచ్చును. లేదా ఓకుట తప్పదు. వీనిని పాండిత్యమువలన జయించుట కష్టమే యగును" అని పరి పరి విధములఁ జింతించి, యాదాసితో "నీవు వెడలి యాకవిని వాదమండపమునఁ బ్రవేశపెట్టి వాక్చాతురియగు నొకదాసికి వేషము వేసి పంపుము. దాని కీకవి

యేమి చెప్పనో నాకెఱుకజేయుము" అనెను. అదివిని యా దాసి త్వరితముగ నేగి, కవిని దోడితెచ్చి, యొకవిశాల మండపమునఁ గూర్చుండఁబెట్టి వచ్చెను. కొంతతడవునకు మహాకవి కడకు నొక సుందరాంగి:—

ఉ. కొప్పున జాజిపూలు మణికుండలముల్ చెవులందు గంధర
గ్గొప్పను పాణిపేరుఁ జనుగుబ్బలఁ గుంకుమ పూఁత పుక్కిటం
గప్పురపున్విడెంబుఁ గనకంపు కడెంబులు చేతులం గటిం
జొప్పడు చల్వదువ్వలువ సొంపు ఘటింప లతాంగి వచ్చెనన్.

అట్లు వచ్చిన దానిని జూచి మందహాసము చేసి 'ఇదియే శారదయగునేమో! వాదమునకు వచ్చియుండునా? కానియంత సౌందర్యముదీనిలోఁ గానఁబడదు. గంభీరతయు లేదు. వెలయాలి వలెఁ గానఁబడుచున్నది. అయినను విచారించెద నని తలఁచి 'ఓ సుందరాంగీ! నీవెవ్వరవో, యెందుకొఱకిటకు వచ్చితివో తెలుపుము' అన దానికా వేషదాసి ఇట్లనెను. "ఓపండితమ్మన్యా! ఏను మాయేలికయాజ్ఞచొప్పన నీతో వాదాడ వచ్చితిని. ఏ శాస్త్రమందు వాదము ప్రారంభించినను సరియే" అనిన కాళిదాసుఁడు "ఓకాంతా! నీకేయేశాస్త్రములు పరిచితములో తెలుపుము. అనంతరము వాదము నారంభింతము" అన దాసి, "నాకన్ని శాస్త్రములూ పరిచితములే! కవిత్వమందును ప్రవీణత కలదు" అన విని కాళిదాసాశ్చర్యభరితుఁడై దీని నొకపద్యముతో వెడలునటులఁ జేయవలయు నని మదిఁదలఁచి 'నీవు నన్ను

జయింప నిశ్చయించుకొని వచ్చునట్లుతే గనఁబడుచున్నదానవు కాని నేను కాముకుఁడ గాను. నీవు జయింప దగ్గవాఁడిట నెవఁడును లేఁడు. నీవు జయింపదగినపురుషు లెట్టివారో వినుము.

సీ. తమకబరీమేఘకమనీయతల కంచ
లళికి పటాపంచ లగుట కతనఁ
దమనాసికాచంపకములకు బెగ్గిలి
యళులు చెల్లాచెద రగుటకతన
దమముఖరాకేందురము కుళ్ళికొ కాళి
యొగిఁ బంచ బంగాళ మగుట కతనఁ
దమయంగరాగ సంకుమదపరిమళ
ములకుఁ జిల్కలు జంకి తొలఁగుకతన
విన్నఁబాటొంది మారుండు మిన్నకున్న
గమన వీక్షా స్తనోక్తివైఖరుల దద్వి
తంబులెల్లను జూపుచుఁ దామె కాము
కుల జయింతు రహో! వీటి తలిరు బోండ్లు."

అట్టి కామాతురుల జయింపవలసిన స్త్రీలే గదా మీరలు! మీకు శాస్త్రవాదముకంటెను ఇదియే మిక్కిలి రుచికరమైనది. నీవు దానికే పనికివత్తువు" అని హేళన జేసెను. దానికి సిగ్గుజెంది వీనియొద్ద మనవిద్య సాగదనుకొని యామందగమన మెల్లఁగ జారెను. అదిగని కవి యామాజారమును దాటి లోని కేఁగెను.

పదియవకట్టునందు కొందఱు దాసీజనులు పాటలఁ బాడుచుండిరి. అందొకతె చక్కనిచిన్నారి వీణియ చేతఁబట్టి

చ. వలిపెపు గావిచేల చెలువంబుగ దాల్చి పూఁచినట్టిచెం
గలువలు గొప్పునం జెరివి కమ్మని పూఁత మెఱుంగుమీఁద మం
చొలసిన భంగి బూసి మధురోక్తులతో మణినూపురధ్వనుల్
చెలగఁగ జేరి వీణె గదలించుచు నల్లన నాలపించుచున్.

అట్టి మంజువాణిపాటల విన కుతూహలాయత్తచిత్తుండై కాళిదాసు కొంతమరుగున నిలఁబడెను. కొంతతడవునకు లోనఁ బ్రవేశించి, వారల యుపచారముల నంది, వారలతో నిట్టుల నెను:- 'మీ శారదాదేవితో వాదమునకు వచ్చిన నాకింతవఱకు శారదదర్శనము లభించినది కాదు. మీరు త్వరగ వెడలి శారద కెరుకఁజేయుఁడు' అనెను. దాని కాచేడియలు పక్కున నవ్వి పరిహాసించుచు మాయేలిక దర్శన మంత సులభమైనది కాదు. ఇంకను నేడుకట్టులు దాఁటినగాని యది లభ్యము గాదు. నీకు సంగీతము తెలియునేని మమ్మోడింపుము. ఆవలసంగతి జూచుకొనవచ్చు' ననఁగా కాళిదాసు రాగయుక్తముగ నిట్టులఁ జదివెను:

శా. ఔరా! పెన్నెఱివేణి చంద మరరే! యామోమునందంబు హా
జ్జారే! కన్గవసోయగంబు బళిరే! చందోయిబాగ్ హాంక మ
య్యారే! బంగరుమేని ముద్దువగ మేలాహా! కళావిభ్రమం
బీరాజాననఁ బోలు సుందరులు లేరెందున్ ధరామండలిన్.

కాళిదాసు రాగరక్తవచనముల కాదాసీజనులు విస్మయభరితలై వెంటనే యొకకర్తుక శారదాదేవి కెరుకజేయుటకై వెడలి, యామెతో నిట్టులనెను. "ఓ దేవీ! ఆకవీశ్వరుఁడు అతిసమర్థుఁ

డు. సంగీతమున నసమానమగు పాండితిగలవాఁడు. వానిని జయిం చుట మనకు కష్టసాధ్యమేయగును. అతఁడిపుడు పరియవకట్టున నున్నవాఁడు. ఏలికయాజ్ఞకెదురు చూచుచున్నాఁడు' అనెను. శారదాదేవి 'ఓచంపకా! నీవు ఆకవీశ్వరుని లోని కనుపుము. నేను మల్లికకు నావేషమువేసి యుంపెదను. దానికి వాఁడేమనునో నాకుఁదెలుపుము. అదేమియు సాధ్యము కానియెడల నీకుఁగల మార్గము సులభమైనది కాదు. మృగరాజుల జయింపనఁగదా! లోనికి రాఁగలఁడు. నీవు వెడలి కొలువుకూటమున కంపుము" అని చెప్పియంపి మల్లికయను దానికి తనవేషము వేసి యుంపెను. కవియును కొలువుకూటమునఁగల యొకచక్కని యాసనమునఁ గూరుచుండి యుండెను. ఇంతలో నందెలు గజ్జెలు మ్రోయ చిందులుద్రొక్కుచు నొకచక్కని చిన్నది లోనఁ బ్రవేశించెను. దాని వెంట నిర్వురు దాసీజనులు సురటిని విసరుచుండిరి. అదిగని కాళిదాసు శారదాదేవి యిది యగునాయని సంశయించుచుండెను. ఇంతలో నాచక్కనిది యొక యాసనమునఁ గూరుచుండి, కవిని కడగంటఁ జూచెను. అదృష్టయందుఁగల రహస్యమును గన్నవాఁడై యిది శారద యై యుండదు. ఇసుమంతయు గంభీరత లేదు. ఇది యొకదాసి యై యుండనోపు." అని మదిఁదలఁచి గంభీరముగ నిటులనెను.

చం. కులుకుం గబ్బలదాన ప్రాణసఖి శాతుంభోపమోరోజ కీ
యిల నేకాత్మలు మీరు శక్తి శివుల ట్లీ వాపెకుం దాదివే

లలిమీర న్మదిలోఁ గఱంగుచును లీలఁ జాఁహంసినా వచ్చు తో
య్యాలి తా నుండఁగ నేల వచ్చితివి? కొమ్మా! నీవు పొమ్మా వెసన్.

అని యిట్లు పలుకగా నాయిందీవరానన "ఓమహాకవీ! నీవు దిట్టినను బహూకరించినను కా దనఁజాల. నీమాటలకు వెఱపుఁ జెందితిని. లోనికే పోయెదను" అని పలికి లోనికి వెడలి శారదతో నీవిషయ మెఱిఁగించెను. అదివిని మనమున భయ ముదోఁప వీనికడ కెవరినీ పంపఁజనదు. నేనే చనవలయు నని నిశ్చయించికొని యాదాదినిపంపి వైచి యేకాంతమునఁ దానా లోచింపఁ దొడఁగెను.

శృంగారకవియు నచ్చోటినుండి లోని కేగఁ బ్రాఁకెను. అది పదునొకండవకట్టు. అందు కీలుబొమ్మలు నానావికార చేష్టలఁ జేయుచుండెను. కాళిదాసు లోనఁబ్రవేశింపగనే అవి యొక్కుమ్మడిగ నేగుదెంచి త న్నావరించుటఁ గాంచి, తనచేత నున్న నొకలావుపాటికఱ్ఱతో వానిం బ్రహరింప మొదలిడెను. వెంటనే అవి యన్నియు వికలములై నేలఁగూలె. అదిదాఁటి పండ్రెండవకట్టునకు బోయెను. అది నిర్జనారణ్యమై కానఁబడెను. కొన్నిక్రూరమృగములందుసంచరించుచుండెను.వానిఁజూచికాళి దాసు భయపడక నోరుదెఱచుకొని వచ్చుచున్న వ్యాఘ్రము బులకు దనచేతఁగల నెత్రిపత్తిని విసరెను. ఆశార్దూలంబులు వానిని మాంస మనియెంచి కాళిదాసును విడచి వానివైపు సాగెను. అదిగని కవీశ్వరుఁడు ఆకట్టును దాఁటి లోనికేగెను.

అట నిరుపార్శ్వంబులనుండియు భల్లూకంబులు పఱతెంచి
పయికిఁగవిసినఁ గని, దనచేతఁగల గంధపుటాలిని శిలాస్తం
భంబుపయిదగులునటులవిసరఁగా,నందగ్ని యుత్పన్నమగుటయు
నాయెలుంగులు భయంపడి చనియె. దానిని గడచి పదునాలు
గవ కక్ష్యనుఁ బ్రవేశించెను. అది మదపుటేనుగులశాలయై యుం
డెను. శృంగారకవిని చూచుటతోడనే నిరువాగులనుండియు
మదకరీంద్రములు తమతొండములఁ బైకెత్తుకొని, కవిపైఁ బడఁ
బరువెత్తుచు వచ్చెను. అదిగని దనచేతఁ గల నిక్షుఖండముల
వానిపై విసర, నవియు వానిని దీసికొనఁ జనెను. అంతఁగవియు
నచ్చోనుండి యావలి కట్టునకుఁ జనెను. అట శాఖామృగములు
పెక్కులుండుటఁగని దనచేఁగల గండుచీమలను కర్కటంబును
వదలెను. వానినిగాంచి యామర్కటములు భయంపడి తొలఁ
గెను. అదిదాఁటి పదునాఱవ కట్టును చేరెను. అటఁగల శ్వానం
బులు కవిని జూచుటతోడనే, గుభాలున పైఁబడరాసాగెను.
అదిగని కవి దనచేతఁగల మల్లెపూల విసరెను. ఆశ్వానంబులు
అన్న మనియెంచి వానిని మూర్కొనుచుండెను. ఇది యదనని
యతఁ డచ్చోటువాసి చనెను. పదునేడవకట్టునఁగల విచిత్ర
ములఁ జూడ నట నేమియుఁ గానబడదాయెను. దారికడ్డముగ
నొకకూప ముండుటఁ గని, ఇదియే యిటఁగల యాశ్చర్య మని
దలఁచి దానిని పరీక్షించెను. దానిని దాఁటినఁగాని యావలి
కట్టును జేర వీలులేదు. దానిని దాఁటుటకై యందుదిగినగాని

సాధ్యము కాదు. దిగిన వెంటనే, ఆకూప ద్వారము నొకపలక యావరించును దిగినవాఁడు లోన నిలుకుకొనును. అంతటి సామర్థ్యముతో నది నిర్మింపఁబడెను. మహాకవి దానిఁ జక్కఁగఁ బరీక్షించి తనచేతనున్న పెనుత్రాటిబండ నందులోఁ బడవైచ నది యాయంత్రమునకు దగిలి, పైభాగమునఁగలపలక మూఁత వడెను. అపుడు శృంగారకవి యాపైభాగమునే మార్గముగ నుపయోగించుకొని దానిదాఁటి పదునెనిమిదవకట్టునఁజొచ్చెను. అట కుంకుమపంకము నిండియుండిన మార్గము కానఁ బడెను. అపుడు శృంగారకవి తాఁగొనివచ్చిన నూనెతెలి కలతోఁ బాదములకు పంక మంటకుండుటకై, పాదములఁ దుడుచుకొని, యామార్గమును దాఁటి యావలికట్టున వెండి పాత్రలో నునుపఁబడిన రెండు పలముల బన్నీటితోఁ దనపాద ముల శుభ్రపఱచికొని, యందు సగము మిగిల్చి, దాని నటఁగల దాసిచేతి కిచ్చి శారదాదేవి కిమ్మని యంపి, యావాకిలి గడచి పందొమ్మిదవకట్టును బ్రవేశించి, మృగములబాధలఁ దప్పించు కొనెను. ఆవలికట్టు మిక్కిలి విశాలమై, భారత రామాయ ణాది గాథలలోనిచిత్రములు చిత్రింపఁబడి యతిమనోహరమై చూపరుల కానంద మొనఁగూర్చుచుండెను. వాని నేకదృష్టితోఁ జూచుచు, కొంతతడవక్కడనే కాలమును పుచ్చెను. పిదపఁ గొంతతడవునకు కాలమునుగనిపెట్టి మూఁడవ యామము ప్రవేశించుచున్న దనిగ్రహించి, యింక నీచిత్రములఁ జూచుచుం

డుట కాలాతీతమునకు కారణమని గ్రహియించి, త్వరగ నటనుం
డిలోనఁ బ్రవేశించుచుండెను. వెనువెంటనే చనుదెంచుచున్న
దాసీజనులు కవిచేష్టితములఁ జూచుచు వచ్చి, 'ఈచిత్రములఁ
జూచుమో కవీశ్వరా!' యని పలుమారు బిలుచుచుండిరి. శృం
గారకవి యాదాసీజనుల వాక్యమునకు విసుగుఁజెంది యిటు
లనెను

చ. తళుకుమిటారి గబ్బిచనుగుబ్బలు వెల్వడఁ బైటఁ బాప్పి కొం
డలుపని గాఁ పొందొడల దట్టము లంగ్రోలగించి చూపి నె
చ్చెలి గనుగీట దగ్గరకు జేరి నిగారపుమారు చక్రపు
న్వలు కగలించి సొమ్ముగొను సైకతి చిత్ర మిదేమి చిత్రమో

చ. పలితములంచు నవ్వకుము భామ మదానన చంద్రబింబ సం
కలితమరీచిజాలములు కుంభములంచు దలంపు మానవుం
బలితతి లెస్స దాగ గని ప్రాయఁపుఁగొమ్మ శ్వేతపద్మమల్
వెంటయున మాలిక త్వమును వెంటనె పొందుట రోయించిచూడగన్.

అని చెప్పగావిని యామచ్చెకంటులు సిగ్గుఁజెంది, యా
తని వెంబడించుట మాని, తమయేలిక కావంగతిని జెప్పగా
నాదేవియు మనంబున నచ్చెరువందుచు, 'ఓచెలులారా!
అతనిని శీఘ్రముగఁ దోడ్కొని రం' డని యాజ్ఞనిడ నటులే
నాచెలులు వేగముపోయి, శృంగారకవిని దోడుకొని వచ్చు
చుండ, నిసువదవవాకిట జలమధ్యమండపమును దాఁటవలసి
యుండఁగా, నొకపలకను వంతెనగఁ జేసికొని దానిదాఁటి,
ఇఱుపది [illegible] కట్టును బ్రవేశించెను. అందు చిత్రవిచిత్రము

లగుస్ఫటికశిలావినిర్మితమగు నామంటపమును జూచి, యత్యా
శ్చర్యభరితుఁడై తదేకదృష్టితోఁజూచుచుండెను. పురోభాగముఁ
గలచిత్రప్రతిమలఁ జూచుచునడచినచో కాళ్లుజారిక్రిందఁబడుట
తప్పనిసరి, క్రింద సతిరమణీయముగఁ బ్రతిబింబము గాను
పించుచుండెను. దాసీజనుల ముందఱ గ్రిందపడిన నవ్విపోదురు
గదా యని సంశయించి, జాగరూకుఁడై నడచెను. అటుల నడచి
యామండపమును దాఁటెను. ఇరువదిరెండవ కట్టును ప్రవేశించి
చూడ, నందుగల ప్రతిచిత్రముననను నిరువురు పండితులు శాస్త్రి
చర్చలఁ జేయుచున్నటులఁ గానబడుట గని, యిది విద్యావినోద
మండప మని గ్రహించి, దానిని గడచి ఇరువదిమూఁడవకట్టును
ప్రవేశించెను. ఆమందిరము రక్తకాంతులీను పుష్పరాగ శిలా
నిర్మితమై యతిమనోహరముగ నుండెను. అందుగల ప్రతి
చిత్రమును తమచేత వీణియల ధరించి, ఇరువురు పద్మముఖులు
వీణియలమీటుచున్నటులఁ జిత్రింపబఁడెను.ఆవసజాక్షులు పుష్ప
రాగశిలానిర్మితములుగాక సజీవముతో నున్నటులఁ గనఁ
బడిరి. అట్టియప్రతిమలనచాతురిగల శిల్పిని మనమున
మెచ్చి యామండపము సంగీతమండప మని గ్రహించి, యాక
ట్టును దాఁటెను. ఇరువదినాలుగవకట్టును జేరి యందుఁగల
వినోదములఁ బరికించుచు, నది సాహిత్యమందిర మని గ్రహించి,
దానిని గడచెను. ఇరువదియైదవకక్ష్యాంతరము బ్రవేశించి,యం
దుగల మరకతశిలానిర్మితములగు వేశ్యాజనము నాట్యమాడు

చున్నటుల నిర్మింపఁబడిన చిత్రప్రతిమలఁ జూచుచు, మనసున మెచ్చి, యది నాట్యమందిరమని మదినెంచి, ఇరువదియాఱవ కట్టును ప్రవేశించెను. అందుగల చిత్రములఁ జూచి యది నర్తన శాలయని నిశ్చయించికొని, యచ్చోటు వాసి, ఇరువదియేడవ కట్టును జొచ్చెను. అట కోడిపుంజుల పందెమునుజూచి యాశ్చర్యపడుచు దానిని గడచి ఇరువదియెనిమిదవ కట్టును జేరెను. అందు పొట్టేళ్ల జగడంబును జూచి, కాలయాపనమును గమనించి యందు నిలువక దాఁటెను. ఇరువదితొమ్మిదవ కట్టు నాటక శాలగ నుండెను. అందు దాసీజనులు పలువురు వేష ధారులై యొకనాటకమును నటించుచుండిరి. శృంగారకవి దానినిఁజూచి దాఁటుటకు మనసులేని వాఁడై యందుం గొంత తడవుండి బయలుదేరెను. అదిగని యానటకురాండ్రు కవి నడ్డగించి స్తోత్రపాఠములు సలుపుచుండ ఇంకను నిక్కడనుండిన కాలము వ్యర్థమగునని యెంచి,యుద్దిష్టకార్యసాధనమునకై వార లపీడవలయు నని మదిఁదలఁచి, తనకెదురుగ నున్న యొకరమణి నిఁజూచి——

క. వదలెడి క్రొమ్ముడి వదలియు
వదలని లజ్జాభరంబు వడికూటములం
గదలెడు నడుమును గదలియుఁ
గదలని చనుదోయి దలఁచి కరగెద రమణీ!

అని పలుక నామందగజయానలు సిగ్గుజెంది వెడలి పోయిరి. కవియు నాచోటువాసి కొలువుకూటమునకుఁ బోవు

చుండగా, దాసీజనులు శారదాదేవితో నిటుల నెఱుకఁ జేసిరి:- ఓయమ్మా! ఇన్ని దినములనుండియు నెవ్వఁడువచ్చినను యెవ రును పదవకట్టును దాఁటలేకుండిరి. ఈకవియో ఇపుడు ముప్పది యవకట్టును దాఁటి కొలువుకూటమున కరుదెంచినాఁడు. వానితో వాదులాట తప్పదు. కావున జాగ్రత్తగ నుండుడు మేము పోయి యింకనేమి జరుగునో తెలుపుదుము." అనిచెప్పి వెడలిపోయిరి. శారదాదేవియు దీర్ఘాలోచనాపరురాలై 'వీని తో వాదులాట తప్పదు. ప్రవేశానర్హముగ మనముంచి యున్న కాఁపులన్నియు వీనిముందఱ నిష్ప్రయోజనములైనవి. ఇతఁడు సామాన్యుఁడు గాఁడనుటకు నిదే నిదర్శనము. మఱచి తిని. మనకు భువనేశ్వరీదేవియాజ్ఞాప్రకారము వీఁడు కాళి దాసై యుండనోపు. వానితో వచ్చినవాఁడే రాజకుమారుఁ డగును. మనకు వివాహకాలము సమీపించినది. అయినను కొన్ని కుయుక్తులఁబన్ని చూచెదనుగాక 'యని యాలోచించుచు లో నగరునకుఁ జనెను.

శృంగారకవియు నాకొలువు కూటమును బ్రవేశించెను. ఆసభాంతర్భాగము మిక్కిలి రమణీయముగ నలంకరింపఁబడి యుండెను. అందొకచో మదమయూర వారంబులు నర్తనము సలుపుచుండెను. మఱొక్కయెడ పికంబులు కలుషకంఠనినాదం బులు సేయ, వేఱొక్కయెడ రాజహంసలు మనోజ్ఞగమనంబుల సంచరింప, భ్రమరంబులు ఝుంకారంబులు సేయ, రాజకీరం

బులు మనోహరముగ బద్యంబులు సెప్ప, కీలుబొమ్మలు బహువిధవాద్యంబులు వాయించుచు సువాసనద్రవ్యముల ధూపంబు వేయ, మల్లెలు మొల్లలు జాజులు బొగడలు పొన్నలు మొదలగు వాసనోపకరణములు కమ్మగ సువాసనల నీను చుండ, నచటకు వచ్చినజనమానసంబు నుత్సాహముగా నప హరింప, నానావిధాలంకారాలంకృతం బగుచు విరాజిల్లు చుండెను. ఇట్టి యమ్మహామండపమున నవరత్నమయంబు లగునుయ్యాలలు గజదంత నిర్మితంబులగు కీలుబొమ్మలు సుర టీలు గైకొని సంసిద్ధములై యుండుటను గాంచి దానియంద మున కాశ్చర్యము నొందుచు, నిట్టియసదృశభోగలాలస యై యుండుట బట్టియే, శారద గర్వించి తనకొక్కరును నీడు లేరని యున్నది. దీనిని జయింప నాకుఁగాక మఱొకరికి సాధ్యంబే? యని యనుకొనుచు, నాతూలికను సమీపించి, యాశ్చర్యము దోఁప తనకరంబున స్పృశించి, యిది యపరిమితమార్దవోపేత మగుటం జేసి స్త్రీలు శయనించునదియనియు, మరొక దాని యందు మృదుత్వమున భేదముండుట గని పురుషుఁడు శయ నించునదనియుఁ దీర్మానించి, దానికి దలకడ కాళ్లకడ యెఱుం గుటకు దనచేత నుండెడు నిమ్మపండును నట్టనడుమ నుంపగా నది దొరలిచని కాళ్లకడ నిలచుటఁ గాంచి, కాళ్లకడను కీలు బొమ్మలును తలకడ నిలువుటద్దములు నని గ్రహించి పురుషుఁ డధివసింపఁదగు మంచమున నారోహించి బరుండెను. ఆమంచ

మునకుఁ జేర్చియే యున్న కీలుబొమ్మలు కవిపరుండుటతోడనే యంత్రములు పనిచేయ, కీలుబొమ్మలు కవి పాదముల నొత్తుటయు, మఱికొన్ని హస్తముల బట్టుటయు, కొన్ని విసరుటయు, కొన్ని యంగమర్దనము సేయుటయు, శ్వేతచామరములు వీచుటయు మొదలగు రాజోపచారముల సేయఁదొడగె. ఇట్లు కీలుబొమ్మ లూడిగంబుసేయ కవిమందహాసము సేయుచు ననుభవించు చుండెను. కవి చేష్టితముల గనిపెట్టుచున్న దాసీజనులు తోడనే శారదాదేవి కెఱింగించుచుండిరి. ఆసుగువయు నామాటలు విని మనమున విచారమును, భయమును ముప్పిరిగొన మైమరచి యుండెను. కొంతసేపటికి ధైర్యము దెచ్చుకొని 'మనమాయల బాగుగ నెఱిగిన వాఁడు గాననే యింతసులభముగ లోనికి వచ్చుచున్నాఁడు. భువనేశ్వరి యాజ్ఞ యెటులున్నదో నేరికెఱుక! చూత' మని వారల కవిచేష్టితముల జూడఁబంపి వైచెను.

శారదాదేవియు గొంతతడ వాలోచించి సాహిత్య సరస్వతి యగుకాంచనమాలను బిలచి, సంగతినంతయుఁ జెప్పి, నీవు నావేషముతో వానితో వాదమునకుఁ బొమ్ము. జరుగు విషయముల నెప్పటికప్పు డెఱుకజేయు మనఁ గాంచనమాలయు తనకు ప్రియసఖుఁ డగుట సందేహించి, యారహస్యమును బయలుపెట్ట రాదని తలఁచి శారదాజ్ఞను నిర్వహింప బయలు దేరెను. అటుల జని శారదాదేవి యలంకారమందిరమును బ్ర

వేశించి, యిచ్చ మెయి యలంకరించుకొని నిలువుటద్దమునం దన సౌందర్యముఁ జూచికొని, కొందఱు సఖులు తన్నుఁబరివేష్టించి యుపచారములుసేయ మందహాసము సేయుచు కవియున్న మండపమును బ్రవేశించెను. దాసినింగాంచి కవియు సగౌరవముగ నాహ్వానించి తనప్రియసఖికి యుచితాసనమిచ్చి కూర్చుండఁబెట్టి పలుకరించెను. కొంతతడ విరువురును నేకాంత మున నుండి, అటుపిదప శృంగారకవి యాకాంచనమాల నిటుల వర్ణించెను.—

ఉ. కాదిది మోము సత్యము మృగాంకబెడబాసిన చంద్రబింబమే
కాదిది చన్నుదోయి ఘనకాంచన నిర్మిత కుంభయుగ్మమే
కాదిది చొకమైన యలకస్థితి మన్మథ శస్త్రిశాలయే
కాదిది కన్నుదోయి యువకౌండ మతంగజ శృంఖలంబ యౌ.

ఇటులు మానసూర్తిగఁ దనప్రియసఖిని వర్ణించి తన కార్యమున కభ్యంతర మగుచున్న దని గ్రహించి దానిని సిగ్గు జెందునటులఁ జేయఁదలఁచి యిటు లనెను.

ఉ. దానిదె పట్టుచీరయును దానిదె భూషణ జాలమెల్లయ
ద్దానిదె పాదుకల్ దలఁప, దానిగ యూకయుసేత యంతయుఁ
దానివిధాన వేషమును దాల్చినదానవు దానిదానవే
చానరొ నిన్నుఁజూడను నిజంబుగ నిల్వకు నీవు నాకడన్.

కవివాక్యములకు నాపీనకుచాభరణ లజ్జితయై తల వంచి యచ్చోటువాసి లోనికిఁ జని, శారదతో నీవిషయ ములు విన్నవించెను. వెంటనే శారదయు ఇట్టిమహాకవి నొక

పరి చూడ వలయు నని తలఁచి సర్వాభరణముల విడిచి మజ్జన శాల కఱిగి సుగంధద్రవ్యంబులతో గమగమ సువాసనలీను హరిద్రాచూర్ణంబు నంగంబుల నలందుకొని పన్నీట జలక మాడి చలువచీఱ ధరించి సామాన్యవేషముతో కొలఁది భూషణముల ధరించి, తనసంగీత విద్యాంసురాలగు రతిరూపకు ప్రధానాలంకారము సేసి నుదుటఁ గస్తూరితిలకముఁ బెట్టి రతి రూపకు నపకర్త్రైయై దానిని ముందు నడువఁ జేసి, తాను వెనుక ననుకరించుచు నీమానినియే శారదయై యుండనోపు నని యతఁడెంచునటుల మంగళ వాద్యంబులతో దాసీజనులు హెచ్చ రికలు వలుకుచుండ, సభామండపమున కరుదెంచిరి. అపుడు రతి రూప యొకయాసనమునఁ గూరుచుండ, శారదాదేవి ప్రక్కన నిలువంబడి తెలియాకులు వినోదముగ మడిచి యారతిరూప కందించుచుండెను. ఈవినోదములఁ జూచి శృంగారకవియు నీకాంతామణియే శారదాదేవియా? యని సంశయించుచు దానింజూచి యిట్లనియె

శ్లో. మధ్యం విష్ణుపదం కుచౌ శివపదం వక్త్రం విధాతుః పదం
ధమ్మిల్లః సుమనఃపదం ప్రవిలసత్కాంచీ నితంబస్థలీ
వాణీ చేన్మధురాఽధరోఽరుణ ధర శ్రీరంగభూమి ర్వపు
తస్యాః కిం కథయామి భాగ్యసులభైః లభ్యా సదా నిర్జరైః.

"కాంతామణి నడుము విష్ణువుండు వైకుంఠము(అనఁగా నాకాశము)నకుఁబోల్చెను. అనఁగా నడుము మిక్కిలి సన్న

ముగ నుండుటచే నడు మున్నటులే లేదనుట. కుచముల శివప
దమగు పర్వతమునకు పోల్చెను. ముఖమును విధాత వసించు
సత్యలోకమునకీడుగఁ జెప్పెను. బ్రహ్మ కమలాసనుఁడగుటచేకమ
లమనుట. కొప్పు దేవతావాస మగు స్వర్గమనెను. పుష్పచయ
ములకు చోటగుటచే పుష్పములతో నిండియున్నదనుట. కటి
ప్రదేశము కాంచి యనెను. అనఁగా మోక్షప్రదాయినియగు
కాంచివలె నుత్తమ మైనదనియు మఱొకయర్థము. ఉత్తమరత్న
ములు పొదుగఁబడిన ఒడ్యాణమును ధరించి యున్నదనుట.
వాక్కులు (అనగా పలుకులు) మధురానగరము. ముక్తిదా
యకములగుపట్టణములలోనొకటగునది.ఉత్తమమునుసూచించు
ను. వాణీ చే న్మధురా=వాక్కులు మధురములనుట. అధరము
అరుణాచలము. పంచలింగక్షేత్రములలో నొకటి. మోవి మిక్కిలి
ఎఱ్ఱదె యున్నదనుట. శరీరము శ్రీరంగభూమి. విష్ణుక్షేత్రము
లలో ముఖ్యము. అనఁగా ఈనారీమణియొక్క యంగముల
యందు నల్లే దేవతలు వసించుచున్నారు గాన సమ్మానింపఁదగి
నది. అని భావము"

అని చెప్పినవిని శారదాదేవి తనమనంబున 'ఈకవీశ్వ
రుని వర్ణనము అపూర్వమైనది. మదీయలక్షణంబులనే యిటుల
వర్ణించెను" అని తనవిశాలనేత్రముల నొకపరి యాకవినిఁ
జక్కఁగ వీక్షించెను. అదిగని కవి

చ. చెలువుగ వ్రాసిదిద్ది విధిచిత్తము రంజిల జీవమిచ్చెనో
పొలుపులగూర్చి మానస విభూతిని గాతుకియై రచించెనా

మెలఁతుక మేనుఁజూడఁ బరమేష్ఠి ప్రభావము నెంచిచూడ నా
నెలఁతుక దోచు నొండుతరుణీమణి సృష్టియటంచు నామదిన్.

అని పలుక నాపద్యమునకు మనంబున మెచ్చుకొను చుండెను. ఇంతలో రతిరూప తానున్న యాసనమును వీడి యట స్త్రీలకై ప్రత్యేకముగ నమర్పఁబడిన దంతపుమంచముపైఁ గూరుచుండ దాని ననుకరించుచు శారదాదేవి తనచేతిలోని తములపాకుల మడిచి ప్రేమామదవతి కందించుచుండెను. దానిని గ్రహించి మందహాసము సేయుచు నములుచున్న యారతిరూపనుజూచి, దానికపటచేష్టలకుఁ దాళఁజాలని వాఁడై శారదను జూచి యిటు లనెను.

శ్లో. తాళాకార పయోధరే తనుభువ స్తంత్రాధికారక్రియే
తామ్యన్మధ్యలతే తటిత్సమరుచే తంత్రీసమాలాపిని
తాటంకాంతతరంగితాక్షి యుగళే తన్వంగి తామ్రాధరే
తారానాథనిభాననే తవకరా త్తాంబూల మానీయతామ్.

విని నాయుడపకత్తెగానున్న శారద తనవెంట నిలువంబడియున్న నొకకంబుకంఠిని జీర, నామె తాంబూల మియ్యరాఁగా, శృంగారకవి యొల్లనని మఱియు నిటు లనెను.

శ్లో. రాజీవారుణ చారుపాణియుగళే! రాకేందురమ్యాననే
విద్యుద్వల్లి సమానదేహలతికే మత్తేభకుంభ స్తనీ!
రంభోరూ గమణీయ ఫాలతిలకే కౌసుంభచేలాన్వితే
ముక్తాహారధరే ప్రియే తవ కరా త్తాంబూలమానీయతామ్.

అని చెప్పుచుండగా కొందఱు మత్తేభయానలు కవిని

జూచి- 'యోకిసీశ్వరా! తాంబూలమిచ్చుదాని నెంతసేపైనను వర్ణించుచుంటివేగాని తాంబూలమును వర్ణింపవైతివి. అట్లున్న నీకెట్లు తాంబూల మబ్బు ననగా—వానికి మందహాసము సేయుచు నిటులఁ బలికెను.

శ్లో. కస్తూరీ పరిమోదపూగకలితం కర్పూర సమ్మిశ్రితం
ముక్తాచూర్ణ సమేత మిందుకిరణై స్స్వచ్ఛాయ వల్లీదళమ్
తత్తాదృబ్జృదనాగమవ్యతికర ప్రస్తావనా కల్పితం
తల్పాకల్ప కలాపినీప్రియతమే తాంబూల మానీయతామ్.

అని పలుకగా విని లజ్జితయై నిలువంబడియుండెను. ఇంతలో మరల శృంగారకవి మఱియొక శ్లోకము శారద నుద్దేశించి పలికెను.

శ్లో. బాలే బాలమృగేక్షణే క్షణరుచే రమ్భోరు రంభాయితే
కుంభాకారకుచద్వయే పరిలసద్రాక్షేందుబింబాననే
త్వత్పాదాబ్జయుగం గతస్య శరణం తాపాది విధ్వంసనే
కామం కామహావిర్భుజః ప్రియతమే తాంబూల మానీయతామ్.

అనిన విని నందఱు నాశ్చర్యపడుచుండిరి. ఇదేసమయ మని శారద తమలపాకులకు సున్నము రాయుచు జాగుసేయ మొదలిడెను. అదిగని శృంగారకవి మఱల నిటులనెను.

శ్లో. ముగ్ధే చంద్రవిరాజమానవదనే సంపుల్లనేత్రోత్పలే
కాంత్యా నిర్జితపద్మరాగనికరే సంసారసంజీవని
గత్యా నిర్జితరాజహంసగమనే స్వర్ణాంబరాలంకృతే
ముక్తాహారపరిష్కృతే సుదతి మే తాంబూల మానీయతామ్.

ఇటుల నడువగా నిని యచ్చోటనుండు చంద్రాస్య లందఱు 'ఓకవిచంద్రా! తాంబూలమును, దానిని మడిచియిచ్చు దానిని వర్ణించితిరి. తాంబూలమును చేతధరించి యుల్లాసముగ కడగంటిచూపులఁ జూచుచున్న యాసుందరాంగిని యొకపరి వర్ణింపుఁడన కవి యిట్టు లనెను.

ఉ. ఆకడగంటిచూపుటారసాయపరంజి మెఱుంగుఁజెక్కులా
చైకురేవంచరీక రుచిసంచిత మేచకచాకచక్య మా
రాకసుధాంశు దాఁచె పగాకని రేక నిరాకరించు మో
మాకుచకుంభ జృంభణ మయారె యొయ్యారికి దానికే తగున్.

అని చెప్పినవిని యాపనజాస్యలు కవిచాతుర్యమునకు రసికతకు వర్ణనాతిశయంబునకు మెచ్చుకొనుచుండిరి. శారదా దేవి తనమనంబున ఈకవిచక్రవర్తి నాచేనంపబడిన కోమలాంగు లందఱ నిరాకరించినాఁడు. ప్రస్తుతము ప్రధాన వేష ధారిణినై వచ్చిన యీమందగమనను కన్నెత్తియైనం జూడక నన్నే వర్ణించుచున్నాఁడు. నన్నే శారదయని గ్రహించినాఁడు నుట కిదియె తార్కాణము. ప్రథమయామమునఁ దనకడకు జేరిన శంపాలతాంగుల నెల్లరఁ బెట్టియు, కొందఱ సన్మానించి యు నొల్లనని పంపివేసినాఁడు. ఇపుడు నన్నుజూచి యపూర్వవర్ణ నలఁజేయుచున్నాఁడు. ఇఁక నీతఁడు మనమోసమునకులొంగఁడు. పాండిత్యప్రభావముచేతను కవితచేతను వీని నోడింపవలయును. అదియును సాధ్యముకా దేనిపివాహసమయ మిదియని గ్రహింప వలయు నని యోచించి కవిని జూచి యిటు లనెను.

" ఓకవిసార్వభౌమా ! నీకు తాంబూలము గావల యునేని నేజెప్పు పద్యములకు భావముఁ దెలుపుము. అందుఁ గడ తేరినఁ దాంబూల మియ్యఁగలదానను. అందోడిన నీ శ్రమ వృథయగు నన శృంగారకవి "ఓచపలాక్షీ ! నీవు చెప్పు పద్యంబులకు ప్రతిపదార్థమును అంతరార్థమును కూడ జెప్పఁ గలవాడను. దానికనియే గదా యింత శ్రమఁ జెందితిని. ఇపుడే చెప్పుము" అన శారద యిదె వత్తు నని యంతఃపురము నకుఁ బోయెను. తోడవచ్చిన సారస నేత్ర లందఱు శారదతో వెడలిపోయిరి.

అంతఃపురమునకు జనిన శారదా దేవియు తనకుఁ దగిన సర్వాభరణంబులఁదాల్చి యలకంబుల మల్లెమొగ్గలు ధరించి సర్వావయవంబులందు కస్తూరీకుంకుమాదులగు పరిమళ ద్రవ్యం బులు గమగమ వాసనలీను చందనం బలంది, చీని చీనాంబర ముల ధరించి, యతిరమణీయమగు సొబగుతో నంతఃపురము వీడి సభామండపమును ప్రవేశించెను దానిసౌందర్యమును గూర్చి కవీశ్వరు డిటుల వర్ణింపఁబోడఁగెను.

సీ. పుండరీకాక్షి యీభువనైక సుందరి
        యాత్రేయవదన యీయబ్జగంధి
  పర్వతజఘన యీభామాశిరోమణి
        మాతంగగమన యీమంజువాణి
  శాండిల్యకుచ యీ యఖండ తేజోనిధి
        శుకవాణి యీమణిప్రకరరదన

భృగుకటిభాగ యీబింబఫలాధర
నారదవేణి యిన్నాతి మిన్న
యౌర యీయింతి పరమహంసాకృతిని బొ
సంగియున్నది మఱి వఱయంగ దీని
నెయ్యమొడఁగూడువాని కున్నిద్రనిబిడ
నిరుపమానందయోగంబు దొరకు టరుదె.

చ. వదనము చంద్రకాంతము ప్రవాళము వాతెఱ జాతివజ్రముల్
రదములు ముంగురుల్ రవిజరాజ మణుల్ తెలిగోళ్లు ముత్తెముల్
పదములు పద్మరాగములు బాలిక నెన్నదరంబె భాసిలెన్
మదను డమూల్యరత్నము లమర్చి సృజించిన బొమ్మ కైవడిన్.

ఇటుల కవి వర్ణించి సగౌరవముగ నాముద్దులగుమ్మ నాహ్వానించెను. శారదాదేవియు కవీశ్వరుని వర్ణనలకు ఉప్పొంగుచుఁ బురుషుఁడు వసించు మంచమునకును స్త్రీవసించు మంచమునకును నడుమ నొకదోమతెర గట్టించి, స్త్రీవసించు మంచమున నాసీన యయ్యెను. కవి సార్వభౌముని మర్యాదతో నావలిమంచము నధిష్ఠింపఁ బ్రార్థించి వాదముల కుపక్రమణము సేయ నాజ్ఞవేడ కవీశ్వరుఁడు వల్లె యనెను.

---

# శృంగార కాళిదాసు

## షష్ఠ ప్రకరణము.

## శారదా దేవి.

### సమస్యాపూరణము.

సమస్యా—వృద్ధస్య భార్యా కరదీపికేవ.

(వృద్ధునకు భార్య చేతంబట్టుకొనిన దీపమువంటిది)

ఓకవిరాజా! నాయీసమస్యను పూరింపుడన కాళిదాసిదియొక ప్రమాదమైన కార్యము గాజాలదు. ఇదిగో జెప్పెదను వినుమనియె.

శ్లో. కరే గృహీతాపి పురస్థితాపి స్నేహేన సమ్యక్పరిపూరితాపి,
పరోపకారాయ భవత్యజస్రం వృద్ధస్య భార్యా కరదీపికేవ.

హాస్తముల బట్టుకొనబడినదియు, నెదుట నుండునదియు తైలము నింపబడినదియు నగు కరదీపిక యెల్లప్పుడును బరులకే యుపకరించును. చేతబట్టుకొనిన వానికి యుపయోగింపదనుట. వృద్ధుని పత్నియు నెల్లప్పుడు పరులకే యుపయోగమగును. వృద్ధుడు దానిని తనచేతం బట్టుకొనియుండినను, తన యెదుట నుంచుకొనియున్నను దత్కాంక్షిత వస్తువులతో తృప్తిబడ జేయుచున్నను, వానిని వంచించి పరులతో నేగూడును.

అని పలికిన లోకాను భవమునకు కరంబు మెచ్చుకొని మరల యిటులనియె.

సమస్యా:—త్రయం యదిభవేదతి చిత్రమేతత్.

(మూడుూడుంటె యదు మహాశ్చర్యము)

అని చెప్పి ముగింపకముందే శృంగారకవియు దానిని తత్క్షణమే యిటుల పూరించెను.

శ్లో. త్యాగో గుణో గుణశతా దధికో మతోమే
విద్యావిభూషయతి తం యది కింబ్రవీమి
శౌర్యం హినామ యది తత్ర నమోస్తు తస్మై
తచ్చత్రయం యదభవేదతి చిత్రమేతత్.

(త్యాగగుణము మిగిలిన గుణములు నూటికంటె నధికమని నామతము. అట్టియుత్కృష్ట త్యాగగుణము గలవానిని

విద్యయు నలంకరించెనేని యేమనగలము? ఆతని యందింక శౌర్యమున్న నాతనికి నమస్కారంబు సేయనగు. త్యాగము, విద్య, శౌర్యంబు నను నీమూడు నొక్కనియందిమిడియున్న నది మహావిచిత్రము) అనిపలికిన విని కవియొక్క కవిత్వ చాతుర్యమునకును ఆశుధారకును మనమున మెచ్చుకొనుచు మఱియు నిట్లనియె.

సమస్య:—యయోస్తు మైత్రీ నతయోర్హి దూరమ్.

(ఎవ్వారలకు మిత్రత్వము గలదో యవ్వారలకు దూరము లేదు.)

అనవిని కవి యిటులనెను.

శ్లో. గిరౌమయూరా గగనేచ మేఘా లక్షాంతరేర్కస్సలిలేచపద్మం ।
లక్షద్వయేగ్లౌః కుముదాని భూమౌ యయోస్తు మైత్రీ నతయోర్హి దూ

(మయూరంబులు గిరులయందును మేఘంబులు గగనమునందు నున్నవి. లక్షయోజనాంతరమున సూర్యుండును, సలిలములోని పద్మమును, లక్షద్వయ యోజనా పరిమాణము గలచోట చంద్రుండును, భూమియందు గలువలు నున్నవి. మయూరపద్మ కుముదంబులకు మేఘ సూర్య శశాంకులకును మైత్రిచే నెంతదూరమున నున్నను ప్రక్కనేనుండు వారివలె మైత్రిని జెందియున్నారు.)

కవి వాక్యముల కాపల్లవపాణి యుపమానంబులకు శ్లాఘించి మరల నతని కిట్లనియె.

సమస్యా—నహి కృత ముపకారం సాధవో విస్మరంతి.

(సాధువులు తమకు జేసిన యుపకారమును మఱువజాలరు.)అనిన నావాక్యమునకు గవిచంద్రు డిట్లనెను.

శ్లో. ప్రథమ వయసిపీతం తోయమల్పం స్మరంతః
శిరసినిహితభారా నారికేళా నరాణాం,
సలిల మమృతకల్పం దద్యు రాజీవితాంతం
నహికృత ముపకారం సాధవో విస్మరంతి.

(నారికేళవృక్షములు తమకు చిన్ననాటంబోసిన నీళ్లు త్రాగియున్నవిగాన నవి స్మరించుకొనుచు శిరంబున బలువు మోచుకొని తమజీవితాంతము దనుక నమృతతుల్యంబులగు జలంబులను నరుల కొసంగుచున్నయవి. ఇవి పిన్ననాటందమకు జేసిన యుపకారంబు మఱువక మహోత్కృష్టమగు ప్రత్యుప కారము జేయుచున్నవి గాన సాధువులు తమకొనరించిన యుపకారంబును మఱువజాలరు.)

అని వచింపగా నామదవతియు కవివచనములకు మన మున శ్లాఘించి వెండియు నిట్లనియె.

సమస్యా;—అదత్త మభుక్త మసుప్తమ్.

(దత్తముగాదు భుక్తముగాదు నిద్రయుగాదు.)

శ్లో. వేద విదేశిల దత్తం దత్తం బంధుజనైస్సహ భుక్తంభుక్తం,
ప్రియతమయాసహ సుప్తం సుప్తం అన్యదదత్త మభుక్త మసుప్తమ్.

(వేదవిదున కియ్యబడునదే దత్తము. బంధుజనుల తోడి భోజనమే భోజనము. కడునిష్టురాలైన కాంతతో నిద్రిం చుటయ నిద్ర. ఇటులగానిచో దత్త మదత్తము, భుక్త మభుక్త ము, నిద్ర యనిద్ర)

అనిన విని నాకాంత వెండియు నిట్లనియె.

సమస్యా—స్స్వయం యాతి విస్తారం వస్తు సంక్షితమ్.

(రక్షితము సేయంబడిన వస్తువు తనకుఁదాన విస్తారంబు నొందుననియు దాచబడినవస్తువు స్వయమే ప్రకాశము నకు వచ్చుననియు రెండుభావములు.)

అన విని యాశ్శృంగారకవి.

శ్లో. జలేతైలం ఖలేగుహ్యం పాత్రేదానం మనాగపి,
ప్రజ్ఞాదానం స్వయం యాతి విస్తారం వస్తురక్షితమ్.

(జలంబులం దైలంబును, ఖలునియందు రహస్యంబును నుత్తమపాత్రమునందుఁ జేయబడిన దానమును జ్ఞానప్రదానంబును అను నీవస్తువులు స్వల్పమయ్యును రక్షింతబులయ్యేఁ దమకుఁ దామ విస్తారనుు నొందును.)

అనిన విని యామగువ పద్యములోఁ జెప్పబడిన లోక న్యాయమునకు సంతసించి మరల నిటులనియె.

సమస్యా---మాయాతి నాఽయాతి నయాతి యాతి

(పోఁడు రాఁడు పోదు పోవుచున్నది.)

ఈసమస్య కేమనునోయని యాశ్చర్యముతో జూచుచున్న శారదాదేవిఁజూచి కవి యిటుల వచించె.

శ్లో. కీటీకరాగ్రా విరహాతురాంగీ చేటీ మవాదీ దిహ చిత్తజన్మా,
ప్రాణేశ్వరో జీవిత మర్థ రాత్రం మాయాతి
నాఽయాతి నయాతి యాతి.

(తన నాయకుఁడు వచ్చునని శయ్యాగృహంబునుండి యెదురు చూచుచుండ నాయకుఁడు రాకపోఁగా తపించుచుండు నాయికయొక్క వృత్తాంతము దెల్పబడుచున్నది. తాము లము చేతంబూని యొకమందయాన తనప్రియసఖుఁడు వచ్చునని ప్రతీక్షించుచుండి యతఁడు రామికి విరహాతురాంగియై

తనచేటితో సఖీ! ఇందుఁజిత్తజన్ముఁడగు మన్మథుఁడు బాధలు పెట్టుచున్నాఁడు. కాని నన్ను వీడి జనఁడు. ఈవేదననుండి తప్పుదునన్న ప్రాణప్రియుఁడు రాఁడు. ఇట్టినాయకప్రేమవంచితంబగు నీప్రాణము నన్నుంబాసి పోఁగూడదాయన్న నీజీవితము పోదు. ఇంకనైన ప్రాణేశ్వరుఁడు వచ్చి గారవించునేమోయన్న నాయాశయులేదు. అర్ధరాత్రంబును గడచిపోవుచున్నది పూర్వరాత్రమున రానివాడిప్పుడువచ్చునా యనిభావము.)

ఆతురముతోఁ జూచుచుండిన శారదాదేవి కమందానందము కలుగఁజేసెను. ఇంక నెంతైన వీని కవిత్వమును శ్రోత్రపేయముగ వినవలయు నని యెంచి యావచించిన శ్లోకమున కాశ్చర్యముఁ జెంది, మఱల నిటులనియె.

సమస్య;—రతిసమయే వేదపాఠ ఇవ.

(రతికాలంబున వేదపాఠము వోలె.)

శ్లో. అనవసరే యత్భణితం సుభాషిత మపి భవతి హాస్యాయ,
వసతౌ ప్రౌఢవధూనాం రతిసమయే వేదపాఠ ఇవ.

(అవసరముగానిచోఁ జెప్పఁబడినమాట సుభాషితమయ్యును అపహాస్య మగును. మన్మథునిచే మందీకృతవ్రీడలై సంపూర్ణయౌవనలై ననవిల్తుశాస్త్రవిచారసార చతురగోష్ఠికుతూహలలై యొప్పు ప్రౌఢకామినులు నివసించుస్థలంబున సవ్వారలతో నతివైదగ్ధ్యంబు మెఱయ ననురాగపేశలంబుగ సంభాషించుచు ప్రణయరసప్రధానమగు వారల ముద్దుపల్కులను వీనులవిందుగ వినుచున్నప్పుడు వేదపాఠము స్త్రీపురుషాదుల కుభయులకును నపహాస్యం బగును.)

అదివిని శారదాదేవి కవిచాతుర్యమునకు మెచ్చుకొని మఱల నిటులనియె.

సమస్య;—ఇతి సచింత్య వై శంభు రర్ధాంగే కామినీం దధౌ,

(అని తలంచియె శంభుఁ డర్ధాంగమందుఁ గామినిని ధరించెను.)

అనిన విని శృంగారకవి.—

శ్లో. అసారభూతే సంసారే సారభూతా నితంబినీ,
ఇతి సంచింత్య వై శంభు రర్ధాంగే కామినీం దధౌ.

(అసారభూతమగు సంసారమునందు సారమైనది నితంబినియ యని తలఁచియే శంభుఁ డర్ధాంగమందుఁ గామినిని ధరించెను.)

అనిన విని యామగువ వెండియు నిట్లనియె.

సమస్య;—పాపాయ పరపీడనమ్.

(పరులను బీడించుట పాపము కొఱకు.)

అనఁగా విని కవిచంద్రుఁడు.—

శ్లో. శ్రూయతాం ధర్మసర్వస్వం యదుక్తం శాస్త్రకోటిభిః,
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్.

(కోటిశాస్త్రములచేఁ జెప్పంబడిన ధర్మమర్మమును వినుము. పరుల కుపకారము సేయుట పుణ్యమగును. పరులను బీడించుట పాపముకొఱ కగును.)

అది విని నాజవ్వని మఱల నిటులనెను.

సమస్యా;—నాఽదత్త ముపతిష్ఠతే.

(ఇచ్చిపెట్టనిది దొరకదు.)

అనఁగా విని కవి.—

శ్లో. యస్య రత్నాకర స్తాతః యస్య లక్ష్మీ స్సహోదరీ,
శంఖో రోదితి భిక్షార్థీ నాఽదత్త ముపతిష్ఠతే.

(దేనికి రత్నాకరుం డని చెప్పంబడు సముద్రము తండ్రియో, దేనికి సర్వసంపత్ప్రదాయిని యగు లక్ష్మీదేవి సోదరియో, అట్టిశంఖము ప్రతియింటి వాకిటికి భిక్షకొఱకు రోదసేయుచున్నది. కాన తొలుత నిచ్చిపెట్టనిది దొరకదు.)

అదివిని సుందరాంగి వీనిని సమస్యచే నోడంచుట దుర్ఘట మగుకార్యమే యగును. సమస్యల నీయకమునుపె ప్రత్యుత్తరము సిద్ధమ గ నున్నది. అయినను మఱికొన్ని కఠినము లగు సమస్యల నిచ్చిచూతము అని యనుకొని యిటుల నెను.

సమస్య:—మక్షికాపాదఘాతేన కంపితం భువనత్రయం.

(మక్షికయొక్క పాదఘాతముచేత ముల్లోకములును గంపము నొందెను.)

సమస్య పూర్తిగఁజెప్పి ముగింపకమునుపే, కవీశ్వరుఁడిటు లనెను.

శ్లో. స్ఫురితే జఠరే విష్ణోః నవనీతభుజ శ్శిశోః
మక్షికాపాదఘాతేన కంపితం భువనత్రయమ్.

అదివిని యామందయాన సమస్యాపూరణమున కవిచంద్రుఁడు విజయుఁడే యగుచున్నాఁడు. వీని కింక సమస్య నిచ్చిన నెంతమాత్రము లాభము లేదు. నానవిధములగు కొన్ని పద్యములఁ జెప్పి భావ మడుగుదము. అని కవితో కవీశ్వరా! ఇఁక సమస్యల మాని, కొన్నిపద్యముల జదువుదును. వానికి దగినభావమును తెలుపుము. అటులఁ దెలుపకపోయితి

వేని యంతతో విరమింతును, అన విని కవియు అదేదియో చదువు మనిన నిటులనెను.

మ. కదళీస్తంభమునందు నాళయుతమై కంజాత మింపొందె నం
దుదయంబై పవళించెఁ జంద్రుఁ డచటం బ్రోత్ఫుల్ల నీలోత్పలం
బొదవెం దత్సుమజాతమై యమున స్వర్ణోర్వీధరం బంది తాఁ
బడి నూత్నై గగనంబుఁ గాంచె నిది యేభావంబో భావింపుమా.

ఒక నారీలలామ మంచముపై గూరుచుండి పతివియోగముచే విచారించుచున్నది.

అనఁటికంబమువంటి తనతొడయందు తామరతూడుఁబోలు హస్తమునుంచి పద్మముబోలు హస్తమును విశాల పఱచి అందు చంద్రునిబోలు తనముఖమునుంచి రోదనము చేయుచుండెను. అటుల నేడ్చుటచేఁ గం డెల్లవారెను. రక్తోత్పలముఁబోలు నేత్రములనుండి యమునానదీ ప్రవాహమో యనునటుల కాటుకనీరు జలజల జాఱఁదొడగెను. అటులజాఱి మేరుసమానమగు నామగువ స్తనములపై [illegible] సహస్రధారలై ఆకసముపోల్కి యున్న నడుమును జేరెను.

క. పండిన పెండిన దొక్కటి
ఖండించిన పచ్చి దొకటి కాలిన దొకటౌఁ
దిండికి రుచియై యుండును
ఖండితముగఁ దీనిఁ దెల్పు కవియును గలఁడే.

అని వచించిన శారదవాక్యములకుఁ గవియు "ఓచంద్రాస్యా! దీనిభావంబు దెలుపుట యెంత దుష్కరమా?" ఇదియె చెప్పుచున్నాఁడ వినుము.

క. శిలవృక్షలతలఁ బుట్టిన
చెలువలు ముగ్గురును గూడి చిడిముడిపడుచుఁ—

తలవాకిట రమియింతురు
సలలితముగఁ దీని నెఱుఁగు సరసులు గలరే!"

అనినఁ గవివాక్యముల కామగువయు నత్యాశ్చర్య భరితయై తాఁబల్కిన తాంబూలవర్ణనంబునకుఁ బ్రతిగా నద్దానిని గవి వర్ణించుటకు సంతసించి మఱల నిట్లనియె.

క. శుద్ధకులజాత యొకసతి
యిద్ధగణిం దండ్రిఁ జంపి యెసఁగువిశుద్ధిన్
బుద్ధిఁ బితామహుఁ బొందుచు
సిద్ధముగాఁ దండ్రిఁ గనియెఁ జెప్పుము దీనిన్.

అన విని శృంగారకవి 'యోపడఁతీ! యిదియా నీవు చెప్పు కఠినభావప్రపూరితము లగుపద్యములు' అని హేళనఁ జేసి, ఇది తక్రము, ఇది శుద్ధమైన క్షీరవంశమున జనించినది. తండ్రియగు దధిని చంపుట యనఁగా మథించుట. దీనికిఁ బితామహుఁడు క్షీరము. దానితోఁ జేరిమియిడుట పితామహుం బొందుట. ఇదియు దీనిభావ, మన విని వెండియు నిటు లనెను.

ఉత్సా. ఐతి నైదునైదు నైదునైదు నైదుగల్గినన్
భాతి గుమ్మితీలు నైదు పంకజాస్యఁ డేసినన్
చేతినై దలుంగపట్టి చీకుపోతు గూడునే
నీతిమేని నైదులేని నీరజాక్షి వేడుకన్.

అని వచియించి దీనిభావంబు వెల్లడిసేయం జను ననిన విని, కవిచంద్రుఁడు ఇది యొక లెక్కయా? విను మిద్దానిని వివరించెద నని చెప్పి యిటులఁ బలికెను.

ప్రథమమునఁ జెప్పఁబడినవైదును అరణ్యసంభవంబు లైన లక్క, మద్యము తేనె, నెమలిపురి, మృగమదము అను నవి. రెండవవైదు సముద్రభవంబులయిన గవ్వలు, శంఖము,

ప్రవాళము, ముక్తాఫలములు, లవణము అనునవి. మూడవదైదు దేశజంబులయిన శాలిధాన్యము ముద్గములు, నారికేడంబులు, కదళి, ఇక్షువు అనునవి. నాలుగవదైదు నగరభవంబులగు దర్పణము, ఉన్మత్తుఁడు, నల్లకోఁతి, వనగజము, మహీపతి. ఐదవది పర్వతజనితము లగుమాణిక్యము మరకతము, వైడూర్యము, నీలము బంగారము అనునవి. మన్మథుని బాణము లైదు. అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము అనునవి. చేతి పైదనఁగా లెక్కించుట, వ్రాయుట, ఆకులుగోయుట, పువ్వులుగట్టుట, వీణవాయించుట యివి. మేని దైదనఁగా నావలింత, నెటికె, ఘూర్ణిల్లుట, కుబ్జత, అంధత్వము అనునవి. అరణ్యసంభవాదు లైనవైదయిదుగా నొండువస్తువు లొసంగినను మన్మథుఁడు కడు ముమ్మరముగ నైదు బాణములం గ్రుమ్మచుండినను, కాయజంబులయిన యాలస్యాదులు లేనియుత్తమకాంతాతిలకము వ్రాయుటమొదలగువాని నైదింటి నెఱుంగనివాని మగవాఁడ నని పేరుపెట్టుకొని యుండువానిని బెండ్లాడునా ? యిదియ దీనిభావము.

అనిన కవివచనములకు సంతసించి వానిసామర్థ్యమునకై మెచ్చుకొనుచుండ కవియు "ఓకన్యకామణీ ! ఇన్నిపద్యములు నీవు చెప్పితివి గాదా ! నే నొకపద్యముఁ జెప్పెదను. దానిభావము విపరింపు మని యీక్రిందివిధముగఁ జదివెను.

ఉ. ఊరువు లంటరాఁ దిగిచి యున్నతమైన కుచద్వయంబుపైఁ
జీర చెఱంగుఁదీసి సతిఁజేరి చనుంగవ బిగ్గఁబట్టి తాఁ
గోరిన కోర్కెఁ దీర్చుకొనె గోమలిఁ బొందకయున్నమాత్రనే
సారము దేల్చుమీ సురతసౌఖ్య మెఱింగినజాణ వైనచోన్.

అనిన కవివాక్యములకుఁ గొంతతడవు యోచించి యి ట్టులనెను. ఒక గొల్లఁడు మేకచన్నులకుఁ జుట్టిన నుచ్చుపాతల విడఁదీసి దానివెనుకటికాళ్లు దిగిచి తన రెండుతొడలనడుమ నిరికించుకొని నుచ్చుపాతలు చన్నులనుండి విడిదీసి చన్నులు గట్టిగబట్టి తాగోరినక్షీరముఁ బొందుటయు దీనిభావ మని చెప్పి యాకన్యకామణి కవి నుద్దేశించి

క. అంచితచతుర్థజాతుఁడు
పంచమమార్గమునఁ బోయి ప్రథమతనూజన్
గాంచియు నచటఁ దృతీయం
బుంచి ద్వితీయంబుఁ దాఁటి యొందెను రాజున్.

అని చెప్పిన విని కవిచక్రవర్తియు, "ఇందుముఖీ! ఇదె చెప్పెద వినుము. పంచభూతంబు లగు పృథివ్యప్తేజోవాయ్వా కాశాలలో నాల్గవవాఁ డగువాయువునకుం జనించినవాఁడు హనుమంతుఁ డయిదవదియగు నాకాశపుఁ ద్రోవం జని ప్రథ మమగు పృథివికి జనించిన సీతాదేవిం గనుంగొని యామెయుం డిన లంకయందు మూఁడవదియగు నగ్నినుంచి, రెండవదియైన జలతత్వమయమగుట జలనిధిందాటి, రామునికడకుం జనుదెం చె" నని దీనిభావము అని చెప్పి తనమనమున నిటుల వితర్కిం చెను. ఎంతప్రొద్దైనను కాలహరణ మిటులే జరుగుచున్నది. ఇక త్వరితముగ ముగింపవలయునని మదినెంచి, "శారదాదేవీ! నే జెప్పుపద్యమునకు భావము నుడువవలెను. లేనిచో యిందుడు గు మని యిట్లు వచించెను.

ఉ. కన్యకు నైదుపాదములు కన్యకు నేడు విలోచనంబులున్
కన్యకు నాల్గుకన్బొమలు కన్యకు నాఱు కుచద్వయంబులున్

కన్యకు ద్వాదశం బనఁగఁ గాంణమధ్యము మున్నయట్టి యా
కన్యక నీవునాకుఁ బదిగావలెఁ గా! యిపు డంగనామణీ !

అనిన కవివాక్యములకు సంతసించి తనమనంబున నితఁ
డు నన్ను పయిఁబయిగ బోనీక యుడుపుచున్నాఁడు. ఇతని
పద్యమున నొక్కకన్యకకుఁ బాదములు మొదలగునవి యైదాఱు
నిట్టివిగా నున్నవని విరోధార్థము పైకి దోఁచుచున్నది. అది
యటులఁగాదు. కన్యారాశికైదవది మకరము. దానివంటివి
పాదములు. ఆకన్యక కాఱవది కుంభము. దానివంటిది కుచ
ద్వయము. దానికి నాల్గవది ధనుస్సు. దానిఁబోలు కనుబొమ
లు. దాని కేడవది మీనము. దానివంటివి నేత్రములు. కన్య
కు ద్వాదశమైన సింహమువంటి మధ్యముగల కన్య నగునాకు
ను తనకును కన్యకకు బదవదగు మిథునము గావలె నని వీని
కోరిక. దీనికి ప్రత్యుత్తరమీయ సాధ్యము గాకున్నది. ఇతఁడు
నావచించుపద్యమునకు భావం బిమ్ము. కాదేని యిం దుడుగు
మని చెప్పియున్నాఁడు. వీఁడో మనలఁ బ్రత్యుత్తర మీయ సా
ధ్యముకాని విధమున పద్యముల నల్లుచున్నాఁడు. వీనివాక్యమే
యథార్థ మగునేమో. ఐన దీనిభావముచెప్పెదను. ఇక దీనినుం
డి వాదమును వేరువిధముగ మార్పవలయును. లేనిచో వీనికి
లొంగుట తప్పదు. అని ఓకవికులతిలకా ! దీనిభావ మిదియు.
కన్యారాశికైదవది యని యర్థము దీయవలయును. నీపద్య
మునకు భావ మిదియు. వేఱగునేని వచింపు మాకర్ణింతు నన
కవి నవ్వుచు "ఓకనకాంగీ ! అది యంతియే యగును. కాని
ఇక జేయువాదమున నీవు విజిత వగుదువేని నాయాజ్ఞప్రకార
ము వర్తింపవలయును. నేను విజితుఁడ నగుదునేని నీయింటికా

పరివాఁడనై నీయిడు అన్నమును గుడిచి, దాసుఁడనై యుండె దను'' అనినవిని శారదాదేవి యటులె నడచుకొందు నిందు సందియము వలదనినఁ గవియు సరే నని మఱల నీక్రిందివిధమున వాదములకు గడగిరి.

శారద:—

సమస్యా:—ఇంకం గస్తురిబొట్టుఁ బెట్టుకుము తన్వీ ఫాలభాగంబునన్.

కవి:—

శా. పంకేజానన! నేటిరేయి వినుమా ప్రాచీశభాగంబునన్
శంకాతంకము లేక షోడశకళా సంపూర్ణుఁడౌ చంద్రునిన్
బొంకం బార్చెద నంచు రాహువెలమిం బొంచుండియున్నాఁడు
వింకం గస్తురిబొట్టు పెట్టకుము తన్వీ ఫాలభాగంబునన్.

అని వచించిన కవి సమస్యాపూరణమున కుప్పొంగుచుండెను. ఇంతలో కవిచంద్రుఁ డిటు లనెను.

సమస్యా:—చేసె నేమనవచ్చు నచ్చెలువ చెలువు.

తే. దానికచకుచగళలక్ష్మిఁ బూనఁ దలఁచి
నీలశైలాబ్జములు పెంపిల నిలిచెనపుడె
కసవుఁగట్టెలు నీళ్లును గడఁగిమోయు
జేసె నేమనవచ్చు నచ్చెలువ చెలువు.

అని విచించిన శారదపలుకులకు గవి సంతసించి తన మది నిటు లనుకొనెను. ఈకాంతామణి సామాన్యగాదు. ఉషఃకాలంబు రాబోవుచున్నది. మూఁడుయామము లిప్పటికి గడచినవి. ఈశారధ శారదయేగాని మరి యొండుగాదు. నేను గనుక దీనితో నింతవనుక వాదులాడ గల్గితిని. నిగూఢార్థములు సయితము తత్క్షణము చెప్పుచున్నది. ఇట్టిపద్యములతో

మనము దీనిని నుడుపం జాలము. నోటవచింపరాని వ్యంగ్యార్థములుగల పద్యముల జెప్పి భావ మడుగవలయును. అప్పటికి గాని విరమించుకొనదు. కర్తవ్య మిదియ. వేరుపాయము గాన రాదు అని తలచి సగర్వముగ శారదతో నిటులనెను.

"ఓ కన్యకామణీ! నీకుగల శాస్త్ర, సాహిత్య జ్ఞానము నకును, కవితాచమత్కృతికిని మిక్కిలి ముదమందితిని. నీయట్టి విద్యావినయసంపన్నయగు కాంతాశిరోరత్నమును నీచతుస్స ముద్రముద్రితమైన భూప్రపంచమునందు నే కనినదియు విని నదియు లేదు. నీప్రజ్ఞకు చాల మెచ్చితిని. నేనిప్పుడు నుడువ బోవుపద్యమే మన పరీక్షకు కడపటి దగును: దానికి భావము జెప్పవైతివా నీవువోడుట యగును. చెప్పితివేని నే నోడుట యగును. ఇదియ చివరదగును." అన నామగువయు, "మహాకవి ! మీరు నన్ను స్తుతించుటకు నేనంతటి గొప్ప దానగాను. ఐన మీనుడువులకు కృతజ్ఞురాలను. కవిచంద్రా! నాతోడ నింతదనుక వివాదంబున నోడక పయింబయిగ నా సమస్యల పూరించిన వారును నాయుక్తులకు ప్రత్యుక్తు లుగ పద్యముల నల్లినవారును నరుదు. మీవిజ్ఞాన మన మానము. పురుషరూపము దాల్చిన భారతియే మీరైయు న్నారు. భువనేశ్వరీమహాదేవి నాస్వప్నమున నుడివినటుల మహాకవికాళిదాసే నన్నుజయింపగలడు. నేను మిగత విద్వాం సులకు లొంగుదాన గాను. మీరెవ్వరో నెఱుగనైతి. వారి వలన గాక మరేరివలనను నాకోటమి కలుగజాలదు. ఐన కాళి దాస సమానులైన మిమ్ము మెచ్చవచ్చు. మీపద్యమేదియో వచింపుడు" అనిన కవి:

శ్లో. నవకువలయమాలీ కల్పితానల్పమాలీ
కమితు రుపరికేళీ కారిణీ కాపి చోళీ
అమితతిమిరజన్యాం మధ్యమాయాం రజన్యా
మమల కమల గంధై ర్వాసయామాస సౌధమ్.

అనిన విని శారదాదేవి మందహాస సుందరముఖార విందయై దలవాంచి యూరకుండెను. పరిహాసదృష్టులతో కాళిదాస తలయెత్తి శారదను వీక్షించుచుండెను. సమీపమున నున్న సఖీజనులందఱు మనశారదాదేవిని దలవాంచు నటుల జేయగల మహావిద్వాంసు డొకడు వచ్చె గదా యని యొండొరులు సంజ్ఞచేసికొన మొదలిడిరి. కవిచంద్రుడును "ఓశారదాదేవీ! యీపద్యభావ మేల వచింపవైతివి" అనెను. అందుకు శారదాదేవి యేమియు వచింపలేక తనమనంబున నిటుల చింతింప మొదలిడెను. ఈకవి వచించిన పద్యమునందు నాయిక నవకువలయమాలికలు తుఱుమున దుఱుముకొనియుండుట జేసి రతిసమయంబున బరిచ్యుతమగు కబరికాభరంబునుండి యాకుసుమమాలికలు జారగా నాకువలయవాసనలు సౌధమునం బ్రసరించె నని చెప్పవలసినదైయుండ నట్టి సమయమునందు వికచకమలవాసనలు సౌధమున గ్రమ్ము జేయుట యెట్లు? చంద్రదర్శనముచే కలువలు వికసించునుగాన నాపరిమళము గ్రమ్మవచ్చును. కమలములు రాత్రియందు వికసింపవుగాన నావాసన గ్రమ్మవు. కువలయవాసనలు గ్రమ్మెనని చెప్పక కమలవాసనలు గ్రమ్మెనని వచించుట యేల యనునది విరోధభంగిగ దోచుచున్నది. దీని కర్థం బిదియై యుండదు.

ఆచోళకాంత పద్మినీజాతిదై యుండనోపు. ఆ దినిశియందు
దనప్రియునితో కేళీవిలాసముగ నుండియుండ మూఁడవజాముస
భావావసానమునొంది కృతార్థత యయ్యె. అందుచే పద్మినీ
యుద్భవమైన పద్మగంధము ఆసౌధమును పరిమళింపఁజేసెను.
దీనిభావ మిదియె. దీని నెటుల నేను లజ్జావిహీననై వచింప
గలను. వచింపకున్న నేనోడినటుల యగును. దీని భావము
జెప్పుదునేని కన్యాత్వము భగ్నమగుటయగాక లజ్జావిహీన
యని నన్ను తూలనాడ కుందురా?

"స్మరణం కీర్తనం కేళిః శ్రవణం గుహ్యభాషణం
సంకల్పో ధ్యవసాయశ్చ క్రియానివృత్తి రేవచ"

అని శాస్త్రకారులచే చెప్పంబడిన సప్తవిధరతులలో
రహస్య విషయములం గుఱించిన సంభాషణము గుహ్య భాష
ణమను రతియందు జేరును. దానిని వచించుటచే దానినినల్సి
న దాన నగుదును. దానిచే కన్యాత్వము సెడును. లజ్జావిహీ
నత్వమును విస్పష్టమగును. ఇది ధర్మసంకటమైనది. దీని భావ
ము జెప్పి శీలమును పోగొట్టుకొనుట కంటె యోడుటయె
యుచితము. అయినను మన మిన్ని దినముల నుండియు మహాప్ర
ఖ్యాతిని వడసి యుంటిమిగదా. అవన్నియు నొకక్షణకాల
ములోనా వదలుకొనుట? ఎంతటి యభాగ్యము మనకిపు
డబ్బినది. ఇతనికిగాక మరే రాజకుమారునికైన విజితనై
యుందునేని కొంత సార్థకమై యుండును. అటుగాక యీబ్రా
హ్మణునకు లొంగిన వీనిని వివాహమాడ వలయుగదా? అటు

లనే సమ్మతింపకున్న ప్రతిజ్ఞ భగ్నమగునుగదా? ఈసంగతి నాజనకునకు దెలిసిన నాయన జింతింపకుండునా? ఎందఱో మహీపతి కుమారులుండ వారలవిడిచి యీదరిద్ర బ్రాహ్మణ విద్వచ్ఛిరోమణికి నన్నిచ్చి పెండ్లి జేయ సమ్మతించునా? అయిన నొక యతిశయము గలదుగదా. భువనేశ్వరీ దేవి యాజ్ఞ యిపుడేమైనది? కాళిదాసే నిన్ను జయింప గలవాడని మునీశ్వరు జెప్పెను గదా. అది యబద్ధమగునా? ఒకవేళ నీపండితుడే కాళిదాసగునేమో? ఎటులైనగానిమ్ము. ఉత్తమకులసంజాతుడు మహావిద్వాంసుడు. త్రికాలవేది. సుందరస్వరూపుడు. దరిద్రుడైననేమి లోపముగలిగె. మనతండ్రిదైన ఈసామ్రాజ్యముండ మనకు దరిద్రమేల సంభవించును. వీనికి పత్ని యగుట విధి యున్న తప్పదుగదా. ఇది దైవఘటనగాబోలు. ఏమైన నగుగాక యని" పరిపరి విధముల నాలోచించి యింకనిక్కడ నుండుట పాడిగాదని మది దలచి తటాలున తా నున్నదంతప్పు మంచమునుండి దిగి తన యంతఃపురమునకు జనియె. ఆమహాకవియు శారద మారుపలుకక వెడలు చుండుట గని తన కోడిన దని నిశ్చయించుకొని మందహాస ముఖారవిందుడై యాతూలికపైననే కూర్చుండి యుండెను.

---

చెన్నపురి: ఆర్యభారతీప్రెస్సులో, [7. అరణిగంగన్నవీథి, చాకలపేట] ముద్రితము.—1928.